# ఝాన్సీ నానా

(Non-Detailed study for Secondary Schools)


రచయిత:

బ్రహ్మశ్రీ డి. వి. పి. భుజంగశర్మగారు,

ప్రధానాంధ్రోపాధ్యాయులు,

బోర్డుహైస్కూలు, కొల్లిపర, గుంటూరుజిల్లా.



ప్రకాశకులు:

రైతు బుక్కు డిపో.,

ప్రొ॥ ఆర్. చంద్రయ్య అండ్ సన్సు,

రాజమండ్రి.

1957





| వెల రు 1—0—0

రాజమహేంద్రవరమున
శ్రీ కొండపల్లి ముద్రాశాలయందు
ముద్రింపఁబడియె.

# ఝాన్సీ నానా

## ౧

## వలస

మహారాష్ట్ర దేశమునఁ గల "మాధిరన్" కొండ లోయలలో గిరిపల్లెలు పెక్కులు గలవు. అందు వేణు వొక గ్రామము. కాని ఆ గ్రామమున కొక విశిష్టత కలదు. ఉత్తమజాతి వంశీయుల కచ్చోటు జన్మభూమి. వేణువు వాయుచలనమాత్రమున లయానుగుణముగా శ్రవణముల కింపు నొనగూర్చుపాట వెలువరించునుగదా! ఇంతియ కాదు. మేలుజాతి ముత్తియములకుఁగూడ వేణువు జన్మభూమి.

'మాథరన్' ఉపత్యకలలో నున్న "వేణువు" నుండి మాతృదేశదాస్యముఁ బాపనోపు నొక దేశభక్తముక్తాఫల ముదయించినది. అద్దాని విలువఁ గట్టఁగల శక్తిసంపన్నులు కడునరిది: కాని యాముత్యము వెలువరించిన యనంతకాంతి పుంజమునకు కన్నులు మిఱుమిట్లు గొన 'ఈస్టిండియా కంపెనీ' యుద్యోగు లంధీభూతులైనారు. వారల గుండెలు చెదరినవి. ఒకరితో నొకరు రహస్యముగా సమాలోచించుకొనుటకుఁ గూడ వ్యవధి నొసంగినది కా దాయుత్పన్నకాంతి వాహిని.

వేణీగృహస్థులలోఁ బెక్కురు సామాన్యులు. సంపన్నులలో మాధవరావు నారాయణభట్టు కుటుంబ మొక్కటి. తాతలనాఁటి ప్రతిష్ఠయే కాని నారాయణభట్టునది సామాన్య సంసారము. వెనుకటి గౌరవప్రపత్తుల నిలువఁబెట్టుకొనుటకై మాధవరావు పెనఁగులాట యంతయు. మూరెఁడు పొట్టకు బారెఁడు క్రిందకుండఁ జూచుకొనుట మాధవరావున కలవాటు.

గంగాబాయి మాధవరావునకుఁ గడుఁ గూర్మి యిల్లాలు. మహాసాధ్వి, భర్తమనస్సున కెక్కుఁ బ్రవర్తింప నేర్చినది. వీరల కొక సిసుపు కలిగినాఁడు. అంతకుఁ బూర్వమొక రిద్దఱాఁడుపిల్లలు గల్గినారు. పురుషసంతానము గలిగిన కొలఁది కాలమునకు వేణును వదలి పోవ నాయాలుమగలకుఁ గోరిక యొదవినది.

“రోగి పాలు కోరనుండఁగా వైద్యుఁడును పాలు త్రాగు” మని చెప్పినట్లు దేశకాలపరిస్థితులు లోనగూడి వచ్చినవి. భారతదేశమునఁ గల స్వదేశసంస్థానము లొక్కొక్కటిగా ఆంగ్లేయులచేఁ గబళింపఁబడుచున్నవి. పీష్వారాజ్యమునకు నీయాంగ్లరాహుగ్రహణము తప్పలేదు. సాలుసాలుఁ గోటి రూపాయలు ఆదాయముగలది పీష్వారాజ్యము. లార్డు డల్హౌసి రాజనీతికి బాజీరావు లొంగిపోవలసివచ్చినది. ఎనిమిది లక్షలు మాత్రమాతనికి వత్సరభృతిగా నిచ్చుట కేర్పాటు గావింపఁబడినది. దానితో బాజీరావు బ్రహ్మావర్తమునకుఁ బయనము గట్టినాఁడు. సాయుధులగు నెనిమిదివేలమంది యనుచరులు బాజీరావుతోఁగూడ నుండ నేర్పాటు కలదు.

మఱియు బాజీరావుతో ననేక మహారాష్ట్రకుటుంబ ములవారు బ్రహ్మావర్తమునకు బయలుదేఱినారు. ఈప్రయాణమునకు నిర్బంధము లేదు; నిషేధము లేదు. బయలుదేఱి వచ్చినవారు భోజనాదివసతులకై వెదకుకొననక్కఱలేదు.

గంగాబాయి కీవార్త తెలిసినది. పయనమునకై భర్తను బ్రోత్సహించినది నారాయణభట్టునకు ఆప్తజనమును వదలుట కిష్టము లేదు. వెళ్ళుటయా? వెళ్లకుండుటయా?– ఈసమస్యకు పరిష్కారమార్గము కానరాలేదు. ఆఁడుపిల్లలు లోకజ్ఞానవిహీనలు. పయనమునుగూర్చి వారి నడిగియుఁ బ్రయోజనము లేదు. ఇంక మిగిలినది పసివాఁడు.

నారాయణభట్టుదంపతులు వేఱొకచోటునకు వెళ్లినను స్వస్థలముననే యున్నను వారు సంపాదించు కీర్తిప్రతిష్ఠలు సామాన్యములు. జీవితములు వెళ్ళించుటయే వారల ఆశయము. ఈగ్రామమున నివసించినను, ఢిల్లీపత్తనమున నివసించినను వారి కయ్యది విశేషముదావహము కాదు– ఖేదజనకమునుగాదు. వారలకుఁగల బాలశిశువు భవిష్యత్తునమూర్పు దేని కేఁగలుగు సన్నివేశ మున్నచో నద్దానిని వా రాచరించుదురు. భవిష్యత్తునెవ్వరుఁ దెలిసి చెప్పఁగలుగుదురు?

గంగాబాయి యొకయుక్తి నాలోచించినది. బాలుని భవిష్యత్తునుగూర్చిగదా యీప్రయత్నము. ఆ విషయ మా బాలునకే వదలివేయుట మంచిదనుకొనినది. బాలునొకచోఁ

కూర్చుండఁబెట్టినది. వానికి సమాన దూరములలో భిన్న దిశలయందు, ఈక్రిందివస్తువు నుంచినది. పండ్లు పాయసము ఆటవస్తువులు ఒకదిక్కున; కలము ఖడ్గములు వేఱొకచోట- ఇందు బాలకుల సహజముగా నాకర్షించు పానీయముల నీ బాలుఁడు ముట్టుచో వేణువును వదలి పోకుండుటకు, వీర పురుషోచితములగు కలము ఖడ్గముల నీబాలుఁడు ముట్టుకొనఁ బోయినచో బాజీరావుతో బ్రహ్మావర్తమునకుఁ బోవుటకును నావీరమాత సంకేతములుగా నొనర్చినది. పాలు పండ్లు గల చోటఁదాను కూర్చుండినది. కలము ఖడ్గము లున్నయెడ నారాయణభట్టును కూర్చుండఁజేసినది. తల్లిదండ్రుల ప్రేరణ లేకయే, యాబాలుఁడు పాటాడుచు, బిరబిర ప్రాకుచుఁ బోయి తన్నెవరో తఱుముకొని వచ్చినట్లుగ తాను సాగకంటె ముందుగా నాపందెమున గెలుపుగొనవలె నన్నట్లుగా చేతులు చాచి యటఁగల ఖడ్గము నందుకొనుటలో నాతనిచేయి ముందునకు పోయినది. నారాయణభట్టు మనస్సు దద్దరిల్లినది. తల్లికుమారుని ఎత్తుకొని ముద్దాడినది. చేతికిఁ గల్గిన చిన్న గాయమునుండి స్రవించిన నెత్తుటితో తల్లిపయ్యెద తడిసినది. గంగాబాయి యపుడు నిజముగా వీరమాతవలెఁ బ్రకాశించినది.

ఇంక ననుమాన మేల? ప్రయాణము స్థిరపడినది. నారాయణభట్టు భార్య గావించిన సంకేతమునుఁ బాలుని చర్యయుఁ గాంచినపిమ్మట నాకుగ్రామమును, వదలి పోవుటకే నిశ్చ

యించుకొనినాఁడు. పూర్వజన్మ కర్మయే మనల నాయా మార్గముల నడిపించుచుండునుగదా! పూర్వులు దీనినే "ఋణానుబంధ" మని చెప్పుదురు. ఆ యనుబంధముగల దిక్కునకుఁ బురుషు నదియే చేర్చుచుండును.

---

## ౨

## కు మా రి కా దు, కు మా రుఁ డే

మోరోపంతుతాంబు బ్రాహ్మణుఁడు. భాగీరథీబాయి యాతని సహధర్మచారిణి. అతఁడు కిర్మిష్ఠి. లౌకికజ్ఞాన సంపన్నుఁడు. కార్యధురంధరుఁడు. కడు దారిద్ర్యపీడితుఁడు. భుక్తి గడుచుట కాతఁడు తన శక్తి కొలఁది చిమాజీ రాజకార్యములఁ జూచుచుండును. నూటికిఁ దక్కువ కాకుండ మాస వేతన మాతనికి ముట్టుచుండును. దానితో నాతఁడు తన సంసారమును బొదుపుగాఁ గడుపుకొనుచుండును.

చాలకాల మతఁ డనపత్యుఁడు. భాగీరథి సంతాన ప్రాప్తికై పెక్కునోములు వ్రతములు ఆచరించుచుండునది. 1835 నవంబరు 16-వ తేదీ ఆపుణ్యదంపతులను అనపత్యతా దోషము వీడి చనినది. శిశూదయమున నా దంపతులు కడు హర్షము నొందిరి. జాతాశౌచదినములు గడచినవి తలిదం

ద్రులు సంభ్రమోత్సాహములతో నాశిశువునకు 'మనూ బాయి' అని నామకరణము గావించిరి. 'ధన్యాపితృముఖీ కన్యా' అను న్యాయము ననుసరించి, ''యీపసిఁడి భాగ్యవంతురా లగును. మఱియు నీమె యశఃకాంతులు దశదిశలు వ్యాపింపఁగల'' మని నామకరణమహోత్సవమున కేతెంచిన కార్తాంతికులు మోరోపంతునకుఁ దెలియఁ బలికినారు.

శుక్లపక్ష శశికళవలెఁ గ్రమాభివర్ధిత యగుచుండఁగ నామె జననీజనకులమాత్రమే కాదు, ఆమెను గనుఁగొన్న వారందఱకుఁ బ్రేమపాత్ర యగుచుండెను. నొక్కులుగల ముంగురులు, విశాలఫాలము, ఆకర్ణాంత నేత్రములు, క్రాలు చెవితమ్మెలు, నువ్వుపువ్వఁ జెల్లు నాసిక. పద్మములఁబోలు హస్తతలములు, అరఁటిబోదెలఁబోలు నూరువులు, అమ్ముల పొదులఁ బోలు జంఘలు. మీనాకృతి పాదములు. పచ్చిపసుపుకొమ్ము వన్నె మేను - మహారాజుల యంతఃపురమున కర్హత సూచించుచున్నవి. అట్టి మహాలక్షణాలక్షితరాలు ఒక పేద కుటుంబమునఁ బుట్టినది - రాజగృహిణి యగునేమో యెవ్వరు చెప్పఁగలరు? బ్రాహ్మణకులజాతయగు దేవయాని మహారాజు భార్య కాలేదా? అగతికయయి కణ్వాశ్రమమున లభించిన శకుంతల దుష్యంతునిచే వరింపఁబడి భారతనారీమతల్లి యని పేరుఁ గాంచలేదా?

సుతనిర్విశేషగా నాపెను పెంచుకొనుచు నానందించుచున్న మోరోపంతు సుఖజీవనాకాశమును విషాదమేఘ

ఛ్ఛాయలు హఠాత్తుగా నాక్రమింప నారంభించినది. అతని కాశ్రయభూతుఁడైన చిమాజీ మరణించుట తటస్థించినది. పంతు నిరుద్యోగియైనాఁడు. తీరిక హెచ్చినది. షష్ఠిగడియలు నాతని కిపుడు మనూబాయితోఁ గాలక్షేపము. ఆ తండ్రి కుమార్తె లెన్ని గంటలు గృహకృత్యకాలము ప్రసంగములలో కాలము గడుపఁగలరు ?

పంతు కామందకాదిగ్రంథములఁ జదువుకొనఁ దెచ్చినాఁడు. మనూ ఆతనిం జదువుకొననిచ్చునదా ? అందలి ప్రతి శ్లోకమునకుఁ దాత్పర్యము చెప్పినపుడే ఆపిమ్మటిపుట నాతఁడు చదువుకొనఁ ద్రిప్పుకొనఁగలుగుట సంభవ మగును. ఆమె కందలి విషయబోధ గావించుటయే యాతని కానందదాయకము. అపుడప్పుడామె "ఇతఃపూర్వము రాజ్యము లేలిన వనితలెవ్వరు ? వారలకథ లెట్టివి ?" యని ప్రశ్నించునది. పురాణములనుండి యాతఁ డొకరిద్దఱ నుదాహరించినాఁడు; కాని వారల రాజ్యపాలనావిధానముంగూర్చి యామె యడుగుచుండునది. అపు డాతఁ డెట్టి సమాధానముఁ జెప్పఁగలఁడు ?

ఇంగ్లీషు దేశకథలనుండి ఎలిజబెత్తు నుదాహరించినాఁడు. కథలనుండియె యామె మనస్సు మఱలించుటకై యార్థికవ్యవస్థ కొంత, పరిపాలనాపద్ధతులు కొన్ని బోధించినాఁడు.

ఇంతలో భాగీరథి పరలోకగతురాలాయెను. "విధి నతిక్రమింప విధికైనఁదరమె ?" పంతు పూర్తిగా దుఃఖసము

ద్రమున మునిఁగినాఁడు. తిరిగి యాతఁడు స్వస్థచిత్తుఁడగుటకు మార్గమేది? మనూకు అతని నోదార్చు శక్తి యెక్కడిది? కూఁతు నాతఁడు లాలింపవలసిన బాధ్యత గలవాఁడుకదా! కావున పత్నీవియోగదుఃఖము దిగమ్రింగక యూరకొనుటకుఁ దప్పనది కాదు.

మనూకు నింక తండ్రియే దిక్కుగదా! పంతులు కాదన లేఁడు; నిర్వహింపను లేఁడు. 'గ్రుడ్డిలో మెల్ల' యనునట్లు సరిగా నీసమయమున బాజీరావునుండి పంతులునకుఁ గొన్ని యత్యావసరకార్యములు చూచుటకు బిత్తూరునకు రావలసినదని వార్త వచ్చినది. పంతులున కింక నుద్యోగముఁ జేయు సాహసమో లేదు. అతఁ డాయుద్యోగముఁ జేయఁబూనుటకు మనూ ప్రోత్సాహమె కారణము.

అతిదుఃఖకరములగు సంఘటనములు సంభవించునప్పుడు పూర్వపునివాసము మార్చుట దుఃఖము నోర్చుకొనుటకొక యుపాయము. తాంబే మనూప్రోత్సాహకారణమున నుద్యోగమునఁ బ్రవేశింప నొప్పుకొనినాఁడని మన మనుకొనుచున్నాము. ఆనాఁడు పంతులు బిత్తూరునకుఁ గాపురము మార్పకయే యున్నచో, మనూజాతకమునఁ గల మహాయోగము వ్యర్థము కావలసివచ్చునుగదా!

కాలపురుషుఁడు ప్రపంచరంగఫలకముపై మానవ చతురంగబలములఁ బ్రయోజనరహితముగాఁ గదల్చుటకుఁ

బూనుకొనఁగు గదా! రాజకీయ చదరంగిపు టెత్తు తెలియని వారి కాకదలిక సామాన్యముగా నర్థము కాదు. "కాయ త్రోసి ఆట కట్టు" అని చెప్పినపు డామొదటికదలిక సార్థక మైనదని సామాన్యులు తెలిసికొందురు.

మోరోపంతు తనకుమారి – తన యేకైకా పత్య రత్నముతో, బిఠూరునకుఁ బయనము సాగించినాఁడు.

---

# 3

## వీ ర కి శో ర ము

ఆతఁ డేఁబదివత్సరములు దాఁటినవాఁడు దృఢకాయుడు. విశాలములగు నేత్రములు గలవాడు. కావలయునని పెంచిన గడ్డమువాఁడు. ఆడంబరము లేని దుస్తులు. అతిశయము లేని మాటలు. వాత్సల్యముగల వర్తనముతో చెన్నారుచుండె. కావుననే వాద కుటుంబములవా రాతని నాశ్రయించి జీవించుచున్నారు.

అతఁడు నివసించు బ్రహ్మావర్త మార్యావర్తమున నొక భాగము. అచటివారి కాతని వినీత వేషము–విశుద్ధవర్తనము మాత్రమే చక్కఁగఁ దెలియును. కొంద ఱతని నొక మహారాజని చెప్పుచుందురు. కాని యాతని రాజ్య మెయ్యది? యనుప్రశ్నకు సమాధాన మొసంగ నెవ్వరు? గలరు.

నిత్యము తొందరలు గలిగించుచుండు రాజ్య ... సమును గాని సతతప్రశాంతి నాపాదించు తపమునుగాని ... డాచరించుచుండుట లేదు. ఆలుమగలు గల సంసారమే యగుట నాతఁ డొక వానప్రస్థునివంటివాఁ డనవచ్చు. అంతియ కాదు; ఆతని కుటుంబములోని తృప్తి యతని నంటి యటనున్న నంద కుటుంబములోని తృప్తి యతని నంటి యటనున్న నంద కుటుంబములలోను గనఁగును.

ప్రశాంతవాతావరణమున జీవితమును గడ్పుచున్న ... తని హృదయకుహరాంతర్భాగమున నొక్కానొక ... వస్థ యప్పుడప్పుడు మొలకెత్తుచుండును. అట్టివేళల నతఁడు తన యాశ్రితుల బిడ్డలఁ గొందఱఁ జేరఁదీయుచుండును. అన పత్యత యీసరదాకుఁ గారణ మని యందఱు భావింతురు; కాని నిక్కముగ నాతని హృదయమును కనుఁగొన్నవా రెవ్వరు లేరు.

ఆతని చుట్టును జేరు బాలబాలిక లందఱు పదినాలుగేం డ్లకు మీఱినవారు; పండ్రెండేండ్ల వయస్సులోపలవారలు. వీరందఱు వారి వారి తీరికసమయములలో వచ్చి యాతని కానందముఁ గూర్చుచుందురు. అందఱకు నాతఁడు తాత. బహుశః ఆతని మీసగడ్డము లాతని కాపేరు సంపాదించిపెట్టి యుండును.

అందఱిలో నై దేండ్లబుడుతఁ డొకఁ డధికముగా నతనిని తనవంకకు నాకర్షించుకొన్నాఁడు. అతనియం దాతాతకు నేమిభవిష్యత్తు గోచరించినదో కాని యాతని దత్తునిగా స్వీకరింప మనసు గలిగినది.

దత్తున కేడవయేఁడు చొరఁబడినది. మహావైభవముతో జన్మదినోత్సవము జరిగినది. తాతను దత్తుఁడు వదలఁడు. దత్తుని వదలి తాత యుండలేఁడు. ప్రశ్నపరంపరలచేఁ దాతను విసిగించువాఁడు దత్తుఁడు. ఆతనిని "నానా" అని సంక్షిప్తముగాఁ దాత సంబోధించుచుండును. ఈ బాలబృందమునొక్క కాలక్షేపమను నొకరు తాతయే చుక్కాని. నిత్యము సాయంప్రాతర్వేళలు తాతకు దేవతాపూజాసమయాలు. బాలబృందమునకు అమావాస్య, శుక్రవారములు ఆటవిడుపుదినాలు. మిగిలిన సమయాలలోఁ గథాకాలక్షేపాలు. తాత కథకుఁడు. నానా ప్రభృతులు శ్రోతలు. రామాయణగాథ వారలఁ గథాశ్రవణలాలసులఁ గావించినది ఆపిమ్మట భారతోపాఖ్యానము లారంభమైనవి. రావు. తాంతియాలు కథలో లీనమైపోవుచు న్నారు.

ఆటవిడుపునాఁ డాకాశభాషితముగా నాబాలబృందము నాటకము నటించును. మనూభాయి ఒకనాయక పాత్ర నభినయించును. రావు తాంతియాలు సేనానులు. సచివోత్తమ పాత్రధారి నానా. తక్కుంగల బాలురు ప్రేక్షకులు.

ఒకనాఁడు తాత వార లాయాపాత్రలఁ జక్కఁగా నిర్వహించుచుండుట తెరచాటుగా నుండి కాంచినాఁడు. ఆమఱునాఁడు తన కథాకథనవిధానము మార్చినాఁడు.

"నేఁ డొక క్రొత్తకథఁ జెప్పెద రంఢు."

"ఏమి టది ?"

"దేశచరిత్ర."

"ఏ దేశచరిత్ర?"

"మన దేశచరిత్ర. అనగా బ్రిటిషువారు మన దేశమున సంచరించిన విధము తెలుపుకథ."

"బ్రిటిషువా రెవ్వరు? మన దేశమున వారి కేమిపని?"

"మొదట వ్యాపారము."

"పిమ్మట?"

"రాజ్యపాలనము."

"మన దేశమున పాలకులు లేరా?"

"ఉన్నారు. కాని అదృష్టదినములు బ్రిటిషువారివి."

"వారిరాజ్యమున నడుగుపెట్టిన దెన్నడు?"

"నాయనలారా! రేపు విజయదశమి పండుగగదా!"

"అగును. 'శమీ శమయతే పాపమ్, శమీ శత్రువినాశనమ్' అని మీరు చెప్పిన శ్లోకము మఱవలేము."

"రేపు శమీపూజగావించి భగవత్ప్రసాదము గ్రహించినపిమ్మట మీ కాకథ నారంభించి చెప్పెదను."

---

# ఉ జ్జ్వ ల భ వి ష్య త్తు

సిద్ధాంతభాగము, ముహూర్తభాగము, జాతకభాగము అని జ్యోతిషము మూఁడు భాగములు. ఏదేనొకపని ప్రారంభింపఁబడిన సమయమునకుఁ దాత్కాలికగ్రహసంపదయొక్క ప్రభావము కొంత బలము చేకూర్చును. ఆ బలసంపద చే నా కార్యము చక్కఁగా నెఱవేఱుచుండుట. దుష్టగ్రహవీక్షిత ముహూర్తమున నారంభింపఁబడిన కార్యవిధానము నుడివడి చెడిపోవుటయుఁ గలదు. సద్గ్రజ్యోతిశ్శాస్త్రవేత్తలకుఁ గాని మంచిముహూర్తనిర్ణయము చేయఁగారిపని. బలవత్తరమగు భవితవ్యత యప్పుడప్పు డా జ్యోతిశ్శాస్త్రవిదుల యూహల భంగపఱచుచుండుటయుఁ గలదు. రాజ్యాధినేతలు నాఁడు యాస్థానముల నిట్టి జ్యోతిర్విదులను బోషించుచుండిరి. రాజులే కాదు, ఏ మాన్య పౌరుఁడును గార్యావసరములం దొక జ్యోతిష్కు నాశ్రయించును.

బ్రహ్మావర్తమున నివాస మేర్పఱచుకొనిన మహారాష్ట్ర కుటుంబములలో నేతచ్ఛాస్త్రము నధిగమించిన యొక కుటుంబమువారు కలరు. తండ్రి కొమారులిరువురు నొకరిని మించినవా రింకొకరు. వైద్యమునకు ముదుసలి, జ్యోతిశ్శాస్త్రమునకు వయసువాఁడు నుండవలయు నని పెద్దలు చెప్పు

చుందురు కదా! కుమారుని గణితము తప్పు గాదని ముసలి వాని యూహ. "ప్రమాదో ధీమతా మపి" యన్నట్లు ఏవేళ నే ప్రమాదము వచ్చినను ముసలివాని పైఁ ద్రోసి తాను తప్పుకొనవచ్చుఁ గదా యని కుమారుని యూహ.

ప్రేలుముడులు, తమ్మపుకట్టెలు, కనుబొమ్మలఁ గుంకుమలు, నీర్కావిధోవతులు, పెండెకట్లు, పుష్పహారములు, అంగుళ్యాభరణాలు, కంకణహస్తాలు, తలపాగలు – ఏతాదృశ వేషాలతో నా పితా పుత్రులు బయలుదేరినారు. వారల పోషణ కర్త గద్దముతాత, వారల రాకనాఁడు రావలసినదిగా వర్తమానించినాఁడు. తాతయు వారలను యథాగౌరవముగా లోనికిఁ గొనిపోయి యుచితాసనములఁ గూర్చుండఁబెట్టినాఁడు. ఆతని బాలపరివారమున కానాఁ డాటవిడుపు. కాని లక్ష్మినారాలతో పలుకు రాచోటునసే యున్నారు. వారల కీ క్రింది సంభాషణము జరిగినది.

"స్వామీ! నాఁ డేదో పత్రము కలదన్నారు. దొరికి నదా యది?"

"దొరకినది. మేమే వచ్చి మీకు కద్దానిని చదివి వినిపింపవలెనని యున్నారము. ఇంతలో దము వర్తమానము నందినది."

"అయ్యది వ్రాసిన దెవ్వరన్నారు?"

"సుమారు వందసంవత్సరములనాఁడు లిఖింపఁబడిన పత్రమయ్యది. మావంశమువారు మొదటినుండియు జ్యోతిర్విదు

లని తమకుఁ దెలియును గదా! మాకు మూఁడవతరముపురుషుఁడావిద్యయందుఁ గడుంగడు సమర్థుఁడు. ప్లాసీయుద్ధసంఘటనమునకుఁ బిమ్మట నీయార్యావర్తమునం గల శాస్త్రజ్ఞులనెల్లర నొకచో సమావేశపఱచిన గౌరవము తమ వంశీయులకే చెల్లినది. ఆసమావేశమున భారతభూమికి బ్రిటిషుపరిపాలన పీడ గలుగుటకుం గల దుష్టగ్రహకూటమిం గూర్చియే, ముఖ్యముగా విచారింపఁబడినది.

మఱియు నయ్యది యంతరించుటకుఁ దిరిగి యెప్పుడనుకూలగ్రహసమావేశము గల్గునో శాస్త్రపరిశోధనఁ గావించుటకు తీర్మానింపఁబడినది. మాపితామహునితోఁ గలిసి మఱియెనుగు రొకసంఘముగా నేర్పడినారు. మాతాత, యద్దానికధ్యక్షుఁడు. వారికిఁ దక్కినవారు సాహాయకులుగాఁ బనిచేసినారు. పదియేండ్ల పరిశ్రమతో లిఖింపఁబడిన యాసిద్ధాంతపత్రిక, తలకొకనకలు వ్రాసి యుంచుకొనినారు. ఈ విషయము మాపూర్వులు మాకేమియుఁ జెప్పినారు కారు. బ్రహ్మోవర్తకమునకు మాతోఁ దెచ్చుకొనిన తాళపత్రసంపుటములతో నాపత్రిక భద్రపఱుపఁబడినది. భూతకాలముం గూర్చి పరిశోధించి యెంతయైన వ్రాయవచ్చుఁగాని భవిష్యత్తు వ్రాయుట దుర్లభముగదా! దేశకాలావిచ్ఛిన్నములై యేర్పడినమార్పులకయ్యది సమన్వయము గావించుకొనవలసియున్నది. అయ్యది తాఁమీ స్వయముగాఁ జిత్తగింపవచ్చును.''

అని తాళపత్రసంపుటముల విప్పి పత్రిక తాత కిచ్చినారు. నానాకాకరపసరున కై పఱుగెత్తినాఁడు. అతఁడు తిరిగి వచ్చులోపల నద్దానిఁ జదువుఁడని యా జ్యోతిష్కులకే యా పత్రికఁదిరిగి యీయఁబడినది. ఇంతలోఁ బసరు గొనిరాఁబడినది. సంస్కృతభాషలోనున్న దాని మాతృకను వారలు చదువనారంభించినారు. అందలి యర్థసార మియ్యది. "అఖిలార్యావర్తదైవజ్ఞ మహాసభవారి నిర్ణయము ననుసరించి, భారతదౌర్భాగ్యావసరణ కాలనిర్ణాయకోప సంఘమువారు పుష్కరకాలము పరిశోధనలు గావించి గ్రహవేధాదికముల నతిక్రమింపక తేల్చిన నిష్కృష్టార్థము.

భారతావనికి సుమారు నూఱువత్సరములక్రిందటనే యిట్టి పరాధీనతాదౌర్భాగ్యదశ సూచించు చిహ్నము లేర్పడినవి. పశ్చిమమున నున్న యొకానొక దుష్టగ్రహవీక్షణము భరతఖండము నైరృతిదిశకుం దగిలినది. మొదట నయ్యది సౌమ్యవీక్షణముగనే ప్రసరించుచు వచ్చినది. దీనికిఁ దోడుగ మఱియొక గ్రహముకూడ నావహించినది. రెండుగ్రహము లట్టివే. ముందటిగ్రహముకంటె నొక్కఁడు వేగముగ ముందునకుఁ బయనించి వచ్చుట తటస్థించినది. ఆయాగ్రహములకుఁ బరస్పరము పోరాట మున్నట్లు గానవచ్చినను మొత్తమున కొకదాని కొకటి తప్పుకొని తిరుగుచుండునవి.

అయ్యవి శని బుధ గ్రహవీక్షితము లగుటచే వ్యాపారత్యా కొంతనష్టముతోఁ గూడిన సఖ్యము-గురుపాదదృష్టిసాక్షి

నపుడెల్ల దేశమున సంఘటితశక్తి యేర్పడును గాని శుక్రుడు వక్రించియుండుటచే విదేశభక్తులు కాలుద్రోలుట కొనర్చు బహు ప్రయత్నములు వ్యర్థమగుసూచనలు గలవు. దీనితో వైదేశిక శక్తులు దేశమున వేరూని ప్రాకుకట్టును. తొంబది సంవత్సరములకు నొకానొక గ్రహకూటమి కానవచ్చు చున్నది. పెక్కుగ్రహములు శుభస్థానములయం దుండి చూచుచుండుటచే నయ్యది తప్పక ఫలకారి కావలె. ఆ సుస మయమున కొంకింత దుష్టత్వముగూడ లేకపోలేదు కాని దైవ యోగానుకూల్యమున భారతభూమికి గొప్ప భవిష్యత్తు కలదు. రక్తపాతము తప్పనిసరి. ఆ పిమ్మట తొంబదిసంవత్స రముల కొక గ్రహకూటమి. భారతస్వాతంత్ర్యము ప్రసా దించునది గోచరించుచున్నది.

ఇయ్యది యొకవ్యక్తితోఁగాని యొకదేశముతోఁ గాని జరుగుపని కాదు. పెక్కునాడులవారు కలసిరావలయు; పెక్కు సంఘటనల నోర్చుకొనవలె.''

ఇంతలో నానా ముందుకు వచ్చి, ''భవిష్యత్తు అనఁగా నేమిటి తాత?'' అనినాఁడు. జోస్యులా ముద్దుబిడ్డని దగ్గ ఱకుఁ దీసికొని, ''పీష్వామహారాజా! ఈబాలునియందు మహాపురుషలక్షణములు గోచరించుచున్న'' వని నుడివినారు.

౨

# ఆ త తా యి క థ

బిచూరున గాజీరావుతోపాటు నూఱుకుటుంబములు వసించియున్న సంగతి పాఠకులు చదివియే యున్నారు. పంతు ఉద్యోగము చేయుచున్నాఁడన్నమాటయే కాని మనూరమే నిజముగా వ్యవహర్త్రి. ఆమెను జూచినవా రామె పదునైదు వత్సరాల వయస్సు గలదని యూహింతురు. ఆ యవయవ సౌష్ఠవ మట్టిది.

బిచూరున కేతెంచినసిమ్మట నెల్లపుడు పురుషవేష మున నామె తాతయొద్ద మెలఁగునది. పంతు గురుత్వము కంటె తాతగురుత్వ మామెకు నచ్చినది. నానా మొదలగు వార లశ్వారోహణాదులగు నేయే విద్య లభ్యసించెడివారలో వానినెల్ల నామెయు నభ్యసించెను. వాని నలవడఁజేసికొను నేర్పాటులా తాతయే కావించినాఁడు. ఇంతయేల? ఆ బాలక బృందమునకుఁ గ్రొత్త నాయకత్వ మేర్పడినది.

“ముదితల్ నేర్వఁగరాని విద్దెగలదే ముద్దార నేర్పించి నన్” యనినాఁడు కదా యొకమహాకవి.

పునాసపంటలతో పుష్కలములుగా నిండ్లు నిండి యున్నవి. ఆ పరిపూర్ణత యందఱవదనములనుండి తొంగి చూచుచున్నది. మనఃప్రవృత్తి సూచించునవి కదా వదనములు!

నవరాత్రదీక్షాదినము లవి. ఆదిశక్తి యారాధన మన్ని చోటుల జరుగుచున్నది. శక్తినారాధించువారలు శక్తు లగుటలో నాశ్చర్యము లేదుకదా ? నూతనశక్తి సంపన్నులై దశమినాఁడు శమీపూజఁ గావింతురు. విజయసూచకము గదా ఆ పూజ! శమీపత్రము లందఱ శ్రవణమూలముల కెక్కినవి. భగవత్పాదుకల స్వీకరించి, కండ్ల కద్దుకొనినారు. లలాటముల రేఖామాత్రముగాఁ గుంకుమ ధరించినారు. తెంపలు వేసికొనినారు. ప్రసాదము లారగించినారు. వారి వారి నివాసములకుఁ జేరినారు ప్రజలు.

కుమార పరివారములతోఁ దాత వెన్నెల షికారు వెడలినాఁడు. వినీలాకాశము, వినిర్మలమేఘసముదాయము — వాని సందులనుండి జాబిల్లి దోబూచులాట; శీతలవాయు ప్రసారము; పరిమళ విలసితవివిధకుసుమ వికాసము—ఇట్టి శరద్రాత్రి విహార మెవ్వరిమానసము నానందాబ్ధి నోలలాడింపదు?

నిరాడంబరముగా నొకచోట శయ్య యమర్పఁబడి నది. జేరగిలఁబడి కూర్చుండుట కేర్పాటు గావింపఁబడినది. చుట్టును జేరినది బాలకబృందము. తాత కా బాలకబృంద ముల తలంపు తెలియును. తాత కథ చెప్పునని డింభకు లెదురుచూచుచుండిరి. ఆ ప్రశాంతవాతావరణమునఁ గథానొక నధిరోహించి పయనించుచున్నా రాయర్భకులు.

"షాప్‌షైర్" ఇంగ్లాండునందలి యొక మహానగరము. అందు ప్రాక్టీసు లేని వకీలు రిచర్డుకైవు. అతని జ్యేష్ఠపురుషా

పత్యము రాబర్టు. క్రీ॥ శ॥ 1725 సం॥న ఆతని జననము. ఇతని తండ్రి కడు సాధుశీలుఁడు: కాని తల్లి నె[illegible].

రాబర్టుక్లైవు రోగిష్ఠిమారి బిడ్డఁడు. తెలివి తేటలు కండ్లలోనే కానవచ్చుచుండునవి. శరీరమున లోపించిన బల సంపద నాతని మెదడున కా యీశ్వరుఁ డొసఁగినాఁడు. "అల్ప విషయములందును నతిశీఘ్రముగా నుద్రిక్తస్థితి నొందున ట్టి స్వభావము గలవాఁడు రాబర్టు" అని యాతని యుపా ధ్యాయుఁ డాతఁడు గుణింతములు దిద్ద మొదలు పెట్టిననాఁడే గుర్తించినాఁడు.

"ఈతఁడు బ్రతికి బట్ట కట్టినచో నాతని మేధాశక్తి చరిత్రలోఁ జిరస్థాయిగా నిలువఁదగిన ఘనకార్యములు సాధించు ననుటలో సందేహము లేదు" అని యాతని నక్ష రాలు దిద్దఁబెట్టిన గురువు పలికిన పలుకులు. రాబర్టునకును జదువునకు నెపుడు నగమెఱుకయే. చదువనివాఁ డేమగు నని తండ్రి యాందోళనము చెందుచుండువాఁడు. కొంటె తనములోనైన నగ్రగామి గదా మావాఁడని తృప్తి నొందు చుండు నాతని తల్లి. నేరములు నానాఁటికి పెరుగుచునే యున్నవి. బజారునందలి షాపువర్తకుల కాతఁ డనిన గుండె హడలు. ఆతఁ డేనాఁ డే షాపువానినైనఁ గన్నెత్తి చూచెనా యా మఱునాఁ డాషాపు కిటికీల యద్దముల కా సాహుకారు ఆశ వదలు కొనవలసినదే.

ఒకనాఁడు రాబర్టున కొకవర్తకునిపై కోపము కలిగినది. ఆ వర్తకుని కొట్టునకుఁగల గవాక్షము లంతకుపూర్వమే యాతని యనుగ్రహమునకుఁ బాత్రములై పోయినవి. అపుడే దబాటువర్షము కురిసి వెలిసినది. వీధుల కిరుప్రక్కల నుండు మురికి కాలువలు వడిగాఁ బరుగెత్తుచున్నవి. వర్ష మాఁగిన తరువాతనే గదా మురికికాలవల ప్రవాహ మధికమగునది. రాబర్టు ఇట్టుగాం డ్రాదారిని వచ్చుచుండుట వర్తకుఁడు గాంచినాఁడు. రాబర్టు అందు లేకుండుటకు సంతసించినాఁడు. కాని యా యుత్తరక్షణమున నావర్తకుని షాపు జలప్లావిత మైనది.

విచారింపఁగా తేలిన సారాంశ మిది:—ఆ కొట్టునకుఁ గొంత దిగువున నొక అడ్డ వేయఁబడినది. అడ్డ యనఁగా రాతితోఁగాని మంటితోఁగాని కట్టఁబడిన దని మీ రూహించుకొనకుఁడు. నీటికాలువకు నడ్డుగా వేయఁబడిన మొదటిబండరాయి, రాబర్టు శరీరమే. తోడివా రాతని సంకల్పముఁ బూర్తి గావించినారు. ఇఁక నేమి, సంకల్పసిద్ధుఁ డైనాఁడు రాబర్టుక్లైవు.

చర్చిగోపు రెక్కి కూర్చున్నాఁడని యొకనాఁడు, నేను కనుంగొంటి మేకెంచి, ముసుఁగువైచి నూతనాగంతుకుని మొట్టినాఁడని వేఱొకనాఁడు—ఇట్లున్నవో నేరములు విన లేక చెవులు చిల్లులుపడిపోవుచుండునని పాప మూరిచెప్పునను.

“రాబర్టు చదివి సంపాదించు” అను నాశ యేనాఁడో వదలినా రాతనితల్లిదండ్రులు. ఇఁక నెక్కుడైన తెల్లకాగితము

నల్ల చేసి జీవింపఁగలఁడా యీబాలుఁడు? అని యహోరాత్ర ములు కుమిలిపోవుచుండువారా రిచర్డుదంపతులు. చదువు దరిఁ జేరని బిడ్డలఁ గూర్చి తలిదండ్రుల మనస్తాప మిట్టులే యుండునుగదా!!

లండనునందలి బడిచదువు రాబర్టునకు సరిపడ లేదు. గుమాస్తాగిరిచదువు నేర్పునట్టి వేఱొకబడిలోఁ బ్రవేశింపఁ జేసినారు. అందాతనికలము చురుకుగా నడిచినది. క్రీ॥ శ॥ 1742 సం॥న మదరాసునఁగల ఫోర్టుసెంటుజార్జియం దొక యుద్యోగి యైనాఁడు. రాబర్టునకు వత్సరమున కైదుపౌనుల వేతనము. 1743 లో ఇండియా కాలఁడు పయనము కట్టి నాఁడు బహు కష్టభరితమైన యాత్రప్రయాణము సాగించి ఇం డియా చేరినాఁడాతఁడు. ఐదువేలమైళ్ళ పయన మనఁగా మాటలా!!

ఒకఁడు :—ఇదేమి తాతగారూ! పండుగనాఁడు మంచి కథ చెప్పెదనంటిరే! ఛీ! ఛీ! ఇదియా కథ?

తాత :—ఈ కథ బాగుగా లేదా?

వేఱొకఁడు :—నిద్ర చేయు తప్ప వేఱేమియు లేదు.

ఇంకొకఁడు :—తలలు మాస్చేవాని కథ మన కెందు లకు తాతా?

ఒకఁడు : —తెల్ల కాగితము నలుపు చేయుచుండువానికే మే నేర్చిన వీనిఁగూర్చి వినిన పుణ్యమేమా పురుషార్థమేమో?

తాత :—తెలుపు నలుపే చేయునో సామ్రాజ్యము నిలువఁబెట్టునో చివరవఱకు కథ వినినఁగదా తెలియువచ్చుట?

శ్రోతలారా! భారతవీరకిశోరముల గాథల వినిన మీ కీ కథ చెవి కెక్కకుండుటలో నాశ్చర్యము లేదు.

నానా:—కథాంత గాథ తెలియుచునేయున్నది. పుష్పము పుట్టఁగనే మరిమళము వెదజల్లదో ?

— —

౬

# సామ్రాజ్య సంస్థాపకుఁడు

తాతగారి కథాకథన సువ్యాహతముగా నాంచోటున నిత్యము సాగుచున్నది నానాప్రభృతులు రసవత్తరఘట్టములు ముందుకథలో రాఁగలవని, తమలోఁ దాము నిశ్చయము గావించుకొనినారు, కథ వినుచున్నారు.

1746 వత్సరమున ఫ్రెంచివారు మదరాసును పట్టుకొన్నారు. రాబర్టుముఖము నల్లవాఱినది. సుబాసీదుస్తులతో నాతఁడా చోటునుండి తప్పించుకొన్నాఁడు. ఫోర్టుసెంటుడేవిడ్ కోటలోఁ దల దాచుకొన్నాఁడు. 1747 వత్సరమున ఫ్రెంచి గవర్నరు డూప్లే డేవిడ్ కోటను ముట్టడించినాఁడు. రాబర్టు యుద్ధపతాకము నెత్తినాఁడు. అదియే యాతని సైనికజీవిత మారంభమయిన ఘట్టము. 1748 లో ఇంగ్లీషువారు పుదుచ్చేరిముట్టడి సాగించినప్పుడు రాబర్టు, కేవలము కలముగిలుకు

వాఁడుమాత్రమే కాఁడని కత్తి పట్ట నర్హుఁడని తన ప్రజ్ఞాబలముచే ఋజువు గావించుకొన్నాఁడు. మఱియు దేవికోట్టకడ తనయుద్ధనైపుణ్యము ప్రదర్శించినాఁడు. లారెన్సు, రాబర్టు ధైర్యమును, పురోగమనమును గమనించి, యుద్ధరంగమున మంచి భవిష్యత్తు గలదని పొగడినాఁడు. జయము సహకూర్చినవాఁడుగదా అధికారులకుఁ గూర్చుంబంటు! 1751లో (Captain) కాప్టెన్ బిరుదుచే రాబర్టు వరింపఁబడినాఁడు. తిరుచునాపల్లికిఁ బంపబడినాఁడు. ఆవత్సరముననే ఆర్కాటును పట్టుకొని దానిని స్థిరముగా నిలువఁబెట్టుకొనుటయు జరిగినది. ఆరణియుద్ధములో రాబర్టు కీర్తి యినుమడించినది. ఫ్రెంచి ప్రతిష్ఠ వన్నె తరిగినది. 1753 సం॥లో మాస్కెలిన (Maskelyne) అను నామె నాతడు తన సహధర్మచారిణిగా గైకొనినాఁడు. విశ్రాంతికై ఇంగ్లాండున కేగినాఁడు.

నాయనలారా! మన కీపరదేశకంచుక మావరించి, సుమారు వందవత్సరములైనది. నాటిచరిత్రఘట్టమొక్కటి మన దేశవాసుల కననుకూలముగా భగవదిచ్ఛ చేసినది. అయ్యది తలవంచుకొనిన నిప్పటికిని, రోమాంచముగల్గుచున్నది. అద్దాని ఫలిత మిప్పుడు మన మనుభవించుచున్నాము. ఆకంపమున నము విచ్ఛిన్నమగు కాల మేతెంచినది. విచ్ఛిన్నము కాని సాధ్యము. ఈశ్వరేచ్ఛయు నట్లే యున్నదని దైవజ్ఞులు లిఖించియున్నారు. మీ కాయ దంతము నంతయు సహేతుకముగా ఋజువుగావించుచును' అని జోస్యులు తెచ్చియిచ్చిన సిద్ధాంతపత్రిక వారి

లకుఁజూపినాఁడు. మిగిలిన కాలమంతయు నా బాలురు వేయు ప్రశ్నలకు ఉత్తరమిచ్చుటలో నా తాత కూపిరి త్రిప్పుకొన వీలు కలుగక పోయినది. ప్లాసీయుద్ధమునుగూర్చి రేపు చెప్పెద నంటిరికదా తాతగారూ! నేఁటి కథ అదియేనా?

తాత :—అగును. మన దేశజాతకమున, యోగ భంగ మారంభమైన మొట్టమొదటి యుద్ధ మదియే తండ్రులారా!

బాలురు :—సరిగా నా శతాబ్దదినముననే, మన మాతృభూమి శత్రునిర్ముక్తము కాఁగలదు. జోస్యులు చెప్పి నదియు సరిగా నంతియ—

తాత :—తొందర వలదు బాబూ! నానా! నీ విటు రమ్ము. నా దగ్గఱగాఁ గూర్చుండుము. జాగ్రత్తగా విషయ ముల నవగాహనము గావించుకొనుచుండుము.

బాలురు కార్యశూరులు, ఉత్సాహవంతులు - వారల కుఁ గావలసినది క్రమశిక్షణ, ఓర్పుమాత్రమే. గురుసేవా విశేషమున నవ్యావి వారల కలవడఁగలవు. స్వార్థపరత వదలి దేశసేవకై బాలురు తమ శక్తి సామర్థ్యముల నే దేశమున నుపయోగింతురో ఆదేశముననుండి, పరదాస్యము పదివేల యామడలు పరుగు పెట్టుననుట నిజము. పరదాస్య విమోచ నమునకు దేశభక్తి బీజములు బాలుర హృదయ క్షేత్రముల విత్తఁబడవలసి యున్నవి. పరమతసహనమనెడి మహామం త్రము పఠించినఁగాని, అనైక్య రాక్షసి పలాయన మాచ

గింపనేరను. ఈ విధముగా నానాబృందము నా సంఘఫలకము నెప్పటికప్పుడు మెఱుఁగులు దేఱునట్లు గావించుటకు శ్రాణీ రావు మూలకారణము.

---

౨

## పంతు విచారము

వివాహము కావలసియున్న కన్య వరుని రూపమును కాంక్షించును. కన్యకామాత యల్లుని ఐశ్వర్యమును గూర్చి ప్రశ్నించును. జనకుఁడు చదువుకొని ప్రఖ్యాతుఁడైన వానిని యల్లునిగాఁ బడయఁగోరును. తక్కుంగల బంధుజనులు వరుని వంశ మర్యాదలఁ దెలియఁగోరుదురు. ఇది లోకసహజము.

"కన్యా పితృత్వం ఖలు దుఃఖాయ" కన్యకు తండ్రి యగుట కంటె మహాదుఃఖము ప్రపంచమున వేఱొకటి యుండఁ బోదని దీని యర్థము. మాతాపితలు, కుమారులకంటెఁ గూఁతుల నెక్కుడు గారాబముతోఁ బెంచుచుందురనుట నిజము. ఇట్టి గారాబముతోఁ బెరిఁగిన సుకుమారపుత్రికను నూతన వాతావరణమునకు నలవడుట కొంత క్లేశముతోఁ గూడినపని కదా! సామాన్య సంసారముల నిట్లుండునుగదా? ఏక కన్యకా విషయమున నా తల్లి దండ్రుల ప్రేమాతిశయము నెట్లు వర్ణింపఁ నలవియగును? అందును మాతృవిహీనయగు కన్యక విషయమున నా కన్యకాపితకుఁ గల బాధ్యత యాతనికే తెలియును.

మోరోపంతు తాంబే కహర్నిశలు మనూబాయిని గూర్చియే విచారము. ఆమె నొక్కయయ్యచేతిలోఁ బెట్టి యీయాలుమగల సంసారము గాంచి, భాగీరథీబాయి వియోగముమాట మఱచిపోవఁ దలఁచినాఁ డాతఁడు. విద్య, వయస్సు, అర్హత గల యొకకుఱ్ఱవానిని తెచ్చి మనూతో వివాహముగావించి. తనయింటనే కూఁతు నల్లుని తనయొద్ద నుంచుకొనఁ దలఁచు నొకనాఁడు. అట్లుకాదు-సమర్థుఁడగు నొక్కనికిచ్చి తాను దూరముగా నుండి చూచి సంతోషింప నూహించువాఁడు వేఱొకనాఁడు. విద్యాసంపదచే మనూబాయికిఁ దగిన వరుని తేఁగోరు నింకొకనాఁడు. మహారాజయోగసంపన్నురాలగునని చిన్నప్పుడు జ్యోతిష్కులు పలికిన పలుకులు జ్ఞప్తికి రాఁగా, నట్టి మహాయోగ మేనాఁ డీమెకుఁ గలుగునో కదా యని యువ్విళ్ళూరుచుండు వాఁ డొకనాఁడు. భాగీరథీబాయి, బ్రతికియున్నట్లయిన నీసమస్య యెన్నఁడో పరిష్కృతమై యుండునదికదా యని మనూబాయి చాటున నున్నప్పుడు వాపోవుచుండు వాఁడు పంతు.

ఏమైనను తల్లిలేని సంతానమునకు శుభకర్మలు యథాకాలమున జరుగవనుట నిశ్చయము. కార్యాలోచనములు పెక్కులు తాంబే తలలోఁ దిరుగుచున్నవి. వాని నాతఁ డెవ్వరితో సంప్రతించియొకనిశ్చయమునకు రాఁగలఁడు! మనూతో వివాహవిషయమును హెచ్చరించుటకే యాతఁడు

లజ్జించుచుండువాఁడు. కాదా మఱి - పెండ్లిమాట తలపెట్టినచో వయసుబాలురే యాచోటను వీడి పరుగిడుదురు గదా? పెండ్లి మాటలు సంగతి వేఱుగాఁ జెప్పనేల ?

---

## ౮

## వైవాహికము

కాశియే వారణాశి, వరణ, అశి నదుల సంగమస్థానమున నుండుటచే నిద్దానిమహిమ హెచ్చినది. భారతదేశమునఁ గాశి పేరెఱుంగనివా రుండరు. సమస్తశాస్త్రము లిచ్చట సంపూర్ణముగా వికాసము నొందినవి. కల్యాణము నను ప్రకాశించునది కావునఁ గాశి యనుసార్థకనామము దీనికిఁ గలిగినది. కాశి కనతిదూరమున నున్న ఘూస్నీ యొక చిన్న స్వదేశసంస్థానము. సంస్థానప్రభువు గంగాధరరావు. కొలఁదిదినముల క్రిందట నతనికిఁ గళత్రవియోగము సంభవించినది. గంగధరరావు అనపత్యుఁడు. సహధర్మచారిణి లేని రాచరికరము, శాస్త్రమొప్పుకొనదు. ప్రజలలో గౌరవము గలుగదు. రాజదండమును దాల్ప సభార్యునకే హక్కు గలదు. రాజ్యమున కుత్తరాధికారియుండుట ప్రజలును గోరుచున్నారు. మరల వివాహమాడి యౌరసుని బడసి, రాజ్యము స్థిరము గావించుకొన నిశ్చయించుకొనినాఁడు గంగధరరావు.

సంస్థానమున కధీశ్వరి కాఁదగు లక్షణములుగల కన్యక కొఱకై యన్వేషణ గావింపఁబడినది. పలువురు బ్రాహ్మణోత్తములు నలుదెసలకుఁ గన్యావరణమునకై పంపఁబడినారు. అందొక చతురుఁడు మోరోపంతుతాంబేయొద్ద వివాహయోగ్యమగు వయసుగల కన్యకామణి గలదని వినెను. కాని కార్యసానుకూలత నొందించుటకు రాజకీయపు టెత్తుకంటె వేఱుమార్గము సులభమైనది లేదుకదా!

మనూబాయి, బాజీరావునాశ్రమములోఁగదా పెరఁగినది. కులీనత, విద్యార్హత, సుగుణసంపద- వీనిచే నామె రాజ్ఞీపదమునకుఁ దగియున్నది. కాని పంతు అంగీకరించిన నాఁడే యీ సంబంధము ముడివేయ వలనుపడఁగలదు. పంతు, చిమాజీరావు నాశ్రితుఁడుగదా! బాజీరావుచేఁ జెప్పించిన పంతును ఒప్పుకొనఁ గలఁడు. ఈపద్ధతిలో నా బ్రాహ్మణుఁడు కృతకృత్యుఁడైనాఁడు.

గంగాధరరావు రెండవవివాహముసంగతి పంతు చెవిని వేయఁబడినది. ఆతనిహృదయ మొక్క-క్షణమూఁగినట్లనిపించినది. బాజీరావు ఈసంబంధమువిషయము కల్పించుకొనుటచే పంతు మఱింత చీకాకు నొందినాఁడు. దైవనిర్ణీతమున్న మన మెన్నడు తప్పడ లేము కదా! యని యానాఁటికి బాజీకిసమాధానము నొసంగినాఁడు. కాని యారేయి ఆతనికి నిద్ర పట్టినదికాదు. ఈసంబంధమున కొప్పుకొనుటయా? తిరస్కరించుటయా? ఇదే ఆనాఁ డాతనిమునందు తాండవించిన సమస్య.

మఱియొకనాఁడు బాజీరావు మరల సంచ్చరించునాఁడు పంతు కొకయుపాయము తోఁచినది. ఇందు మనూబాయి యభిప్రాయము సేకరించిన ప్రసమాట యుండదు సప్కారా దసినాఁడు. ఇఁక నేమి? వ్యవహారము కొంగసుగొసుగా తోఁచినది.

బాజీరావుచే మనూబాయికి గంగాధరరావు వృత్తాంతము చెప్పింపఁబడినది. ఇంతటి క్లిష్టసమస్య తనిప్పుడింతలో నెదుర్కొనునని యామె యెన్నఁడు నిదివఱకుఁ దలంపలేదు. నిత్యము అశ్వారోహణము, కత్తిసాము, కామందకపఠనము, ఆర్థికవ్యవస్థ-ఇన్నింట పరిశ్రమ చేయునామెమనసునకు సైతము వివాహవృత్తాంతము కొంత ఆయాసమునే కల్గించినది.

వైవాహికసంబంధములు స్వర్గమున మొదట నిశ్చయింపఁబడును. లౌకికవ్యవహారములన్నియు నా మొదటినిశ్చయమును కార్యరూపము ధరింపఁజేయుటకు ఉపకారకములుమాత్రమే. కావుననే యొక్కొక్కపుడు పీటలమీఁది పెండ్లిండ్లు తప్పిపోవుట జరుగుచుండును. అన్నిసంగతులలో నొడంబడికలు కుదిరియు చిన్నమాటపట్టింపుతోఁ గార్యవిఘ్నము సంభవించుచుండును. ఇట్టి పవిత్రసంబంధమువిషయమున సబలయగు మనూబాయి యొక్కమాటుగా నిశ్చయమునకు నెట్లు రాఁగలదు? తండ్రియు, నీభారమును తనయమీఁద వదలుటచే నామె కొంత దీర్ఘముగా నాలోచింపవలసివచ్చినది.

ఏవిషయమున నైన, మనుజుఁడు ఆప్తవాక్యము ప్రమాణముగా స్వీకరించుట సహజము. మనూబాయి కిప్పటి

బాజీరావు పరమాప్తుఁడు. కాదనలేము కదా! గంగాధర రావు సంబంధమున కాతఁ డూఁత యొసంగినాఁడు. సత్తీర్థులగు నానా తాంతియాలు మనూబాయికి హత్తుకొనను మహారాణి యోగమునకు హర్షము వెలిపుచ్చినారు: బాజీరావు, మోరో పంతు తాంబే నెన్నఁడో సమ్మతింపఁ జేసినాఁడు కదా! ఇంక మనూబాయి కుగ్గుపాలతో శరీరమున జీర్ణించిన స్వతంత్రత. ధీరత, ధైర్యసాహసములు, అస్త్ర విద్యా నైపుణ్యము-ఇవి యన్నియు నామెను గంగాధరరావు సంబంధమున కియ్యకొను నటులఁ జేసె ననుటలో నాశ్చర్య మేమికలదు?

---

## ౬

## ఫలప్రాప్తి

మహావైభముతో మనూబాయి వివాహము జరిగినది. ఝాన్సీరాజ్యము మర్యాదల ననుసరించి నేఁటినుండి మనూబాయి లక్ష్మీబాయి అగును ఈ దృశరణ విద్యావిశారదురాలిని రాణిగాఁ బడయఁగలుగుట గంగాధరరావునకే కాదు; ఝాన్సీసంస్థానమునకే లక్ష్మీప్రదము కదా!

అత్తింట నడుగుపెట్టినది మొదలా సంస్థానము ప్రజలకామె నిత్యలక్ష్మి యైనది. ఆమె యందఱకు నాప్తబంధువురాలు. ఏనాఁ డెవ్వరు తమకు నేది కొఱఁత యనుకొందురో

యీ మఱునాఁడు వారి కాకోరింత తీరిపోవుచుండునది. రాణికి తమతమ కోరింత లెట్లు తెలియుచుండెనవో కదా యని సామాన్యు లాశ్చర్యపడుచుండువారు. చారచక్షులు గదా రాజులు!

ఝాన్సీసంస్థాన మిదివఱకు లెన్నఁడుఁ గాంచని సమున్నతిని లక్ష్మీబాయి పాలనమున నొందినది. గంగాధరరావునకు గుండె దిగులు తీరినది. నూతనముగా రాజ్ఞీపదమున నధిష్ఠించిన లక్ష్మీబాయి ప్రజాహృదయము నింతగా నూఱఁ గొనుటలో నామెకుఁ గుడిచేయిగాఁ బ్రవర్తించిన దామె చెలికత్తె మంధర. అడవిలోఁ గాచిన యుసిరికకు సంబుధ లవణముతోఁ జేర్చిన రుచి యుదయించునట్లుగా లక్ష్మి మంధరల స్నేహమే యీ ప్రజానురాగమునకు మూలము. దేశచరిత్రల నన్నింటిని దిరుగవైచినను పన్నానందుని యొక రిద్దఱు మాత్రమే మంధరఁ బోలినవారు కలరు

లక్ష్మీబాయి దా హృదలక్షణముల ధరించిన దన్న వార్తకు గంగాధరరావు మిక్కిలిగా సంతోషించినాఁడు. ఝాన్సీప్రజ యీ వార్తకు సంతకంటె నెక్కుడుగా మోదము వహించినారు. దేశమంతయు రాజ్యభారవహన దక్షుండగు పురుషసంతాన ముదయింపఁగల దని యాశించుచున్నది. లక్ష్మీబాయికి పదనెలలు నిండినవి. కుమారోదయమైనది. లక్ష్మీబాయి కింతకంటెఁ గావలసిన దేమికలదు! ఝాన్సీ రాజ్యము నుత్సవముఁ జేసికొనని గృహము లేదనిన నతిశయోక్తి కాదు.

లక్ష్మీబాయికి వంశోద్ధారకుఁడు గలిగె నన్నవార్తకు మిక్కిలిగా సంతోషించినవారు పలువురు గలరు. నానా తాంతియాలు తనకు మేనల్లుఁ డుదయించినట్లు లుత్సవము గావించుకొన్నారు. లక్ష్మీబాయి యాశీస్సులతో శుభసందేశములఁ బంపినారు. బాజీరావు తనకు దౌహిత్రు లుదయించినట్లే సంతసించినాఁడు. మోరోపంతు తాంబే మనోవ్యథలన్నియు నాఁటితోఁ దీరిపోయినవి. తాముగా నాటిన మొక్క వృద్ధియై పిందెదాల్చిన దశ నెవ్వఁ డానందము నొందక యుండఁగలఁడు ?

---

## ౧౦

## సామ్రాజ్యతృష్ణ

ఝాన్సీపైఁ బ్రవహించిన యా యానందలహరి, కొండవాగు పొంగువంటి దైనది. లక్ష్మీబాయి జీవితమున నూతనఘట్ట మారంభమైనది. మాతృవియోగము తటస్థించి నపుడు పూర్వమామె కొక యోగదశ యారంభించె ననియే చెప్పవచ్చు. బాజీరావు నాశ్రయమున నామె తల్లియుత్సంగమునందుకంటె నెక్కుడుగా లాలింపఁబడుట మహాయోగదశ గాక మఱియేమి ?

లక్ష్మీబాయి తన యపత్యవిషయమున మూఁడు నెలల ముద్దునకుమాత్రమే నోచుకొనినది. దానితో నామెజీవితము

క్రుంగిపోయినది. ఆఱు నెలలైనం గడవకముందే గంగాధరరావు మనోవ్యాధిచే మంచము పట్టినాఁడు. జీవితనైరాశ్యమేర్పడినది. వంశవర్ధను నొకనిని దత్తతం గావించుకొన నిశ్చయించుకొనినాఁడు.

గంగాధరరావునకు సన్నిహితజ్ఞాతికుటుంబములోని వాఁడు ఆనందరావు. అయిదేండ్ల వయసువాఁడు. శాస్త్రీయముగా నతనిఁ దాను దత్తతఁ గావించుకొనుచున్నట్లు ఆనాఁటి యధికారవర్గము నంతటిని బిలిపించినాఁడు. బుందేల్ ఖండ్ అసిస్టెంటు పొలిటికల్ ఏజెంటు మేజర్ ఎలిస్ దొర, స్థానిక సేనాధికారి కెప్టెన్ మార్టిన్, తన సంస్థాన సచివుఁడు నరసింహారావు, ఇంకను పెక్కురు సంస్థానమునందలి పెద్దలు— వీరందఱు నానందరావు దత్తతకు సాక్షాద్ద్రష్టలు. నేఁటినుండి దామోదరరావు అను ఆనందరావు సంస్థానమునకు నుత్తరాధికారిగ గవర్నమెంటు లెక్కలలో నమోదు గావింపఁబడినది. బాలునకు మైనర్ వయస్సు గడచువఱకు తల్లి లక్ష్మీబాయియే సంస్థానమున కేలికగా నుండు నేర్పాటు గావింపఁబడినది. 1853 సంవత్సరము నవంబరునందు గంగాధరుని సాయుజ్యము నొందినాఁడు. పాపము లక్ష్మీస్థితి యెంతయు శోచనీయము! ఆపదను వెన్నంటి వేఱొక యాపద వచ్చుచుండుట లోకసహజముకదా!

ఇంత జరిగినను, డల్‌హౌసి తన యెప్పటి తంత్రమునే ఝాన్సీవిషయమున నవలంబించినాఁడు. రాజ్యము

కంపెనీ పాలనక్రిందఁ జేర్చుకొనఁబడినది. నెలకు నైదువేలు లక్ష్మీబాయికి భరణ మిచ్చుట కేర్పాటు జరిగినది. ఈస్టిండియా కంపెనీ యీవిధముగా నెన్ని స్వదేశసంస్థానముల తన సామ్రాజ్యతృష్ణకున్నై దిగమ్రింగినదో!! తత్ప్రజలయును రెన్నటికైన దానికిఁ దగులకుండ నుండనేరదు.

---

## ౧౦

## కంపెనీతో వ్యాపారము

అది 1856–వ సంవత్సరమున నంతిమమాసము. 1857 నకు సంబంధించిన ఛాయ లద్దాని నపుడే యలముకొనినవి. రాజకీయరంగము లతిక్లిష్టసంఘటనలతోఁ గూడియున్నట్లు, అనతికాలమున ననేకములగు మార్పులు రానున్నట్లుసూచించుచున్నవో యన, నాకాశమున మేఘములు క్షణములోఁ దమంత సంఘటితములై అంతలో విశ్లేషము నొందుచున్నవి. ప్రళయముగా వర్షము కురియు ననుకొనుచున్నంతలో నాకాశమున మబ్బులు విచ్చిపోవుచున్నవి. ఒకప్పుడు హఠాత్తుగా దబాటువర్షము కురిసినకారణమున వ్యాపారావరోధము గల్గుచున్నది. కార్మిక కర్షకులు తమ తమ పనుల నేనాఁడును పూర్తి గావింపలేక పోవుచున్నారు. గొప్ప గొప్ప మిల్లుపని వార లిండ్లకుఁ బోవునపుడు వీధులలోఁ బ్రవహించు కాల్వలు

చూచి, తను యింట్లకడ నారుబయటఁ బెట్టిన వస్తుజాలము కొట్టుకొనిపోయియుండు నని తహతహ నొందుచుండిరి. ఆ కాలమునందలి బూకోసంరంభ మిట్లుండె.

లండనునగరమున నొకనాఁ డొక నూతనుఁడు అద్దె బండిలోఁ బయనము గావించుచున్నాఁడు. ఇంక మఱి యెంత దూరము కొనిపోవలె నని శకటచోదకుఁ డడుగునప్పుడెల్ల "ఇంక కొంచెముదూరముమాత్రమే" యని సమాధాన మిచ్చుచున్నాఁడు. ఆవీధి కిరుపార్శ్వములఁ గల మేడల, సం గడుల వ్రేలాడఁగట్టఁబడిన ప్రకటన ఫలకముల నానూతన వ్యక్తి శ్రద్ధగాఁ బరీక్షించుచుండుట లక్షించిన యీబండివాఁ డాయాగంతుకునితో "స్వామీ! తమ గంతవ్యస్థానముఁ దెలుపుఁడు. క్షణములో దగ్గఱిదారిని గొనిపోయి దిగవిడు చుదు" ననుచున్నంతలో నా నూతనున కేమిగుర్తు కాన్పించెనోకాని వెంటనే 'బండి నాపు' మను మాటతో నాబండి నుండి దిగినాఁడు. 'బండి బాడుగఁ గొను' మని చేయి చాచి నాఁడు. హెచ్చుబాడుగఁ గోరఁదలఁచియున్న యాశకట చోదకుఁడు దానిం గొన సంశయించుచు నేమో చెప్పఁ బెదవి మెదల్చునంతలో నానూతనుండు బాడుగ బండిలోని మెత్తపైనుంచి' తన చేతి సంచి చంక నిడుకొని ముందునకు సాగినాఁడు. ఆ బండివాఁడు తన కీయఁబడిన బాడుగ మొత్త మాతఁ డద్దానిం జేతఁ గొననక్కఱలేకయే తెలిసికొనఁగల్గి నాఁడు. ఆతని యాశ కయ్యది కొంత హెచ్చుగల్గియున్నదని

యాతనికిఁ దెలియవచ్చినది. బాడుగఁ జేతఁ గొనక యే తన కృతజ్ఞతఁ దెలుప నాతఁడు సాగిన దిక్కునకుఁ దిరిగి చూచి నాఁడు. అప్పటికప్పుడే యా సూతనుఁడు పది బారల దూర మునఁ గనుపట్టినాఁడు. ఆ శకటచోదకుఁ డానాఁటి పగటి తొలి బాడుగ సంతృప్తికరముగ లభించుట "ఆ యేసు భగ వానుని లీల" యనుకొని వేఁకొకదో బాడుగఁ జూచుకొన నేగినాఁడు.

అట్లు బిరబిర నేగు నా సూతనుఁ డుంచద్వారము గల యొక బసవాకిట నడుగు పెట్టినాఁ లోపలనుండి యొకఁ డెదురుగా నేతెంచి స్వాగతముఁ దెలుపుచు (salute) జోసికిఁ గొనిపోయినాఁడు. అయ్య యొక పెద్ద భవన మని మాత్రము చెప్పుటతో తృప్తి నొందలేకున్నాము. రాజభవన మని పోలిక చెప్పవచ్చును. కాని మా పాఠక బాలుర కా వాక్యముగూడ సరియగు నట్టాసౌధ భవనము స్ఫురణకుఁ దెచ్చిపెట్టఁజాలదని మా యూహ.

అందు నాల్గంతస్తులు గలవు. మొదటి దాసియుం దా వసతిగృహము పరివారము మాత్రమే నివసించును. రెండవ యంతస్తునందు అందరి గుమాస్తాలు పనిచేయు కార్యాల యము వెచ్చముల కొట్లు నుండును. వివిధతరగతుల భోజన శాలలు, పాఠకశాలలు, ఫలాహారశాలలు, మూఁడవయం తస్తునఁ గలవు. బాటసారులకు విడుదులు విశ్రాంతిభవనములు నాల్గవ యంతస్తున నమర్పఁబడినవి.

ఇందు విడిసినవా రింద్రవైభవ మనుభవింతు రని యీ లండనునగరవాసులకే కా దాయింగ్లండునం దనేగు పట్టణ నుఖ్యాకులగు నితరదేశవాసు లందఱకు ముందుగా తెలిసియుండును.

విద్యుద్ఘోలికలో నా నూతనుఁ డా భవనము నాలవ యంతస్తునకుఁ గొనిపోవంబడినాఁడు. అట నొక గదివాకిటఁ నాతని దిగవిడిచి ద్వారపాలకుఁడు నివృత్తుఁ డైనాఁడు. కవాటము మూయఁబడి యున్నది. విద్యుత్ప్రసారము గల కూట నొక్కుట తడవుగా కవాటము తెఱవఁబడినది. ఉన్నతకాయుఁ డొకఁ డెదురుగా నేతెంచి, యాలింగనము గావించుకొని మన నూతనుని లోనికిఁ గొనిపోయి తన పార్శ్వమునఁ గూర్చుండఁ బెట్టుకొనినాఁడు. వారల కీ క్రిందిసంభాషణము ప్రవర్తిల్లినది.

"భారతభూమి నందఱుకుఁ గుశలమా?"

"కంపెనీపరిపాలన తొలఁగిననాఁడు గదా మనకుఁ గుశలము!"

"పరిపాలన తొలఁగనక్కఱలేదు, శాసనపాలనావిధానము మాఱినఁ జాలు ననుకొందును."

"స్వదేశసంస్థానముల విషయము లెట్లున్నవి?"

"ఎట్లున్నవని చెప్పుదును? పంజాబ్, నాగపూర్, పెగూ, సిక్కిమ్, సంబల్పూరులను కంపెనీపాలనమునఁ గలుపుకొనుట మీ రిదివఱకే యెఱుంగుదురు గదా!"

"మఱి యిప్పు డింకేమైన...!"

"సతారారాజుగూడ ఆగతియే పట్టినది! సతారా రాజ కుటుంబమున జరిగిన పెంపుడు చెల్లనేరదఁట!"

"మఱి ఆవిషయమున మీరేమాలోచించితిరి?"

"ఆలోచన యడుగుటకే యిచటికి కేతెంచితిని. ఇం కేతెంచినపనిలో నెంతవఱకుఁ గృతార్థులు కాఁగల్గిరి?"

"దాదాపుగా నాలుగునెలలు పయనమే పట్టినది గదా! ఇచటి పరిస్థితులు—అధికారవర్గము— పరిచయము గావిం చుకొనునప్పటికొక వత్సరము పట్టినది. ఒకనాఁడు మీవలన యుపకారము జరుగఁగలదని ఆసాసల పీరుల చుట్టు తిరుగుచుం డుట జరిగినది."

"అంతయు ఆసయే కాని కార్యసహాకారిత శూన్యమే యన్నమాట."

"నేఁటితో నాయాసయు తెగిపోయినది. బాజీరావు పీష్వా కీయవలసియున్న ఎనిమిదిలక్షల నెలసరి రాజ్యభృతిని యతనియనంతర మతని వారసగు నానాసాహేబునకుఁ జెందుట న్యాయము గదా!"

"అందులో అన్యాయమక్రమమున్నదనఁగలమా?"

"సిద్ధపోవువాని కాళ్ళను బ్రొక్కినటులున్న నావిషయ మును అపీలు చేయుట."

"భారతజమీందారులకు జరిగిన యీయన్యాయములు భగవంతుని సమక్షముననే పరిష్కారములు కావలయును గాఁబోలు?"

"నే నిట నూరక కూర్చుండలేను. ఇటలీదేశీయుండును, సేనాపతియు నైన గారిబాల్డీని, రష్యాప్రభువైన జారుచక్రవర్తిని మఱి యొకరిద్దఱు మధ్యప్రాచ్యరాజ్యములవారితో నుత్తర ప్రత్యుత్తరముల జరుపుచున్నాను. వారల తోడ్పాటుతో నీవిషయ మిట నొకదారికి రాకున్న మనవీరభారత భూమిపైననే ఫలించునట్లు చూడ, నేనిదే స్థిరసంకల్పముతో నున్నాను. మీతిర్గుపయనమున నిటలీలో దిగి గారిబాల్డిగారిని దర్శించి వెళ్ళుడు."

అని యాతనికిం గొంత చేరువకు చేతెంచి, చెవిలో రహస్యముగా నేమో చెప్పినాఁడు. ఆమాటలు వినునపుడు క్రమముగా నా రెండవవాని ముఖమున వికాసరేఖ లంకురింప మొదలిడినవి.

పాఠకులారా! ఈ సమావేశమున పాల్గొనినవ్యక్తులు భిన్నమతములవారు-విభిన్న సంస్కృతులవారు ఒకరు తూర్పుగా నడచువారు - మఱియొకరు పశ్చిమముగా తిరిగి నడచువారు. ఒకరి లేఖిని దక్షిణమునకు నడచును-వేఱొకరి కల ముత్తరమునకు నడచును. వారొకరినొకరు ఆలింగనము గావించుకొనుట - సన్నిహితులై కూర్చుండుట- విస్రంభముగా సంభాషించుట. సూక్ష్మముగా వీరల నిరువుర నింకొకని దగ్గఱుగాం జేర్చు వేఱొక బలవత్తరమైన విషయము గలదని తెలియుచు నేయున్నదికదా! అయ్యది వీరభారతమున, కంపెనీవారు తల

పెట్టిన స్వదేశ సంస్థాన విచ్ఛేదనోద్యమము గాక వేఱొక్కటి కాదు.

మహారాష్ట్ర పీష్వాప్రభువు బాజీరావు సంస్థానము నెన్నఁడో కంపెనిపరిపాలనము క్రిందకి లాగికొనఁబడినది. బాజీరావునకు నెనిమిదిలక్షలుమాత్రము వత్సరమునకు భృతి యిచ్చునట్లుగా నొడంబడికయు జరిగినది. బాజీరావునకు సక్రమదత్తపుత్రుఁడగు నానాసాహేబునకు నా మనోవర్తి నిచ్చుటకుఁగూడ కంపెనీ పేచీ పెట్టుట జరిగినది. ఇంగ్లాండు నందలి కంపెనీయధికారులకు అపీలుచేయుటకై అతని మంత్రిసత్తముఁడు అజీముల్లాఖా నింగ్లాండునకుఁ బంపఁబడినాఁడు.

అజీముల్లాఖాను సందర్శింప నేతెంచినయాతఁడు సతారాసంస్థానసచివుఁ డని మీకుఁ దెలిసినవిషయమే కదా! తనప్రభునకు జరిగిన యన్యాయమును గూర్చి అపీలు గావించుటకు నేఁడు లండనునగరమున దిగిన యాతఁడు రంగో బాపూజి.

అత్యుత్కటము, దురంతము నగు నన్యాయ మాచరింపఁబడినపుడు ప్రబలవిరోధశక్తులు సుసంఘటితములై యెట్లెదుర్కొన యత్నించుచున్నవో చూతుము.

సాత్వికపద్ధతులలోఁ గార్యములు సాధించుట యను సూత్రము ప్రాచ్యవాసులకుఁ దెలిసియున్నంతగా ప్రపంచమున నింక నేరికిఁ దెలియదనియే చెప్పవచ్చు. మోసముపొంతకుఁ

బోకుండ, యథార్థపరిస్థితి నివేదించి, తమకు కావలసినది, న్యాయమైనట్టిదిమాత్రమే కోరువారు ప్రాన్స్య ముువారు. అన్యాయమున కొడిగట్టి అధికముగాం బొందు కోరిక పాశ్చాత్యుల యాచారము. కావుననే యీసచివద్వయము నింగ్లాండులో నధికారవర్గమునకు విన్నవించుటకు కేగించినారు.

---

## ౧౨

## విప్లవకేంద్రము

కాన్పూరు సంస్థానమున బిఠూరను గ్రామము చరిత్రప్రసిద్ధమైనది. ఇయ్యది వీరక్షేత్రమనం జెల్లును. 1857 వ వత్సరము విప్లవమహోన్నతమున కీచోటుననే మొదటగా బీజావాపము జరిగినది. మొలక కట్టినపిమ్మట నయ్యవి దేశమం దెల్లయెడలకుం గొనిపోవంబడి వీరవరహృదయక్షేత్రములలో నాటంబడినవి. ఆ పిమ్మటంగూడ నా వివిధ క్షేత్రములకు దేశభక్తి జలసేచనప్రక్రియ బిఠూరునుండియే కావింపంబడిన దనవచ్చు.

బిఠూరు గంగాతీరమున కాన్పూరున కనతిదూరమున నున్న గ్రామము. చుట్టుపట్టుల కొండలవరుసలు మూండు కలవు. దుర్భేద్యములై శత్రువుల కగమ్యములుగానున్న యా పరిసరము లాప్రాంతీయులకు సుగమములు.

ఆకొండలమధ్యఁ గొన్ని విశాలభవనములు కలవు. సాధారణముగా నతి యితరజనసంచారశూన్యములు. కాని యప్పుడప్పు డాభవనములకు కొలఁదిజనులు వచ్చి పోవుచుండుటకలదు. వా రేపనినిమిత్తమై యట కేగుదురో, యట కేదారిని జేరుదురో యెవ్వరు నెఱుంగరు.

ఒకనాఁటి యుదయమున నం దొకభవనమునఁ జిన్న సమావేశమున కనువగునట్లుగ నాసనము లమర్పఁబడి యున్నవి. ఆయాసనము లెల్లవేళల నట్లే యుండునో లేక సేవకు లమర్చుదురో! ఆప్రాంతముల వేఱునరులు నివసించియున్నట్లుగా నెవ్వరు నెఱుంగరు. ఆటవికకృషీవలులకే తద్దృశ్యము బెదురుగాఁ గానవచ్చుచుండు. ఆ కుర్చీలమధ్యఁగల బల్లపై చిన్న రాతివిగ్రహ మొకటి కలదు. అయ్యది యశ్వారూఢుఁడైన ఛత్రపతి శ్రీ శ్రీ శ్రీ శివాజీమహారాజుంగారిది.

కోలముఖము: ముఖమునకు మఱియుఁ గోలతన మావహింపఁజేయుచున్న గడ్డము; కొట్టవచ్చునట్లగపడుచున్న నాసిక; ఒఱగు పాగ; పౌరుషాధికమై మూఁగాళ్ళఁబై కెత్తియున్న ఆజానేయముపై సుధీరముగా నాసీనుఁడైయుండుట వీరోచితమైన దుస్తులు; కేలం గ్రాలుచున్న కరవాలము.

ఆభవనము వెనుక కొన్నిగదులు గలవు. బహుశః అటఁ జేరువారి కయ్యవి స్నానపానములకు, అభ్యవహారాధికమునకు నుపయోగించునవై యుండును.

అది యుదయవేళ. భానుఁడు బారెఁడు పయనము మాత్రమె చేసియున్నాఁడు. సమున్నతుఁడైన యొకఁడా వెనుకటి గదులదిక్కునుండి విశాలభవనమున నడుగిడినాఁడు. ప్రవేశించుట తడవుగ నచటిబల్లపై నున్న ఛత్రపతి ప్రతిమకు జోహారు లొనరించి, ఆసనమున నాసీనుఁడైనాఁడు. కూర్చుండియున్న యావ్యక్తి నిలిచియున్నంత ప్రమాణమున నగుపడుచున్నాఁడు. ఎత్తునకుఁ దగిన స్థౌల్యము, విశాలఫాలము, వీరతాసూచకమగు శ్మశ్రురాజము, ముఖభాగమున కంతకు శోభను పెంపుజేయుచున్న ఉన్నతమగు నాసిక, ఎదిరిని చూపులోననే లోఁగొనఁజాలు విశాలసులోచనములు, సుదీర్ఘములగు బాహువులు——ఇవియన్నియుఁ జూడ ఛత్రపతి యాతనియందుఁ బ్రవేశించియున్నాఁడా యనిపింపకపోవదు.

ఆతఁడు తనలోఁ దా నిట్లు తర్కింపఁదొడఁగెను. ''ఆంగ్లేయుల కీదేశమున నుండుట కేమిహక్కు కలదు? పరదేశీయులగు తెల్లవారు మాకు పాలకులా? స్వాతంత్ర్యము మానవుల జన్మహక్కు గదా! దానిఁ బడయఁగోరుట ద్రోహచింతయా? ద్రోహనేరము నారోపించి యురిశిక్షలా?

ప్రజల ధనమానప్రాణములు రక్షింపఁ గంకణము గట్టుకొని యహర్నిశలు ప్రజాసేవాతత్పరులగు దేశీయసంస్థానాధిపతులు కేవలము ధర్మాచరణపరాయణులులే కాని, ఆంగ్లేయుల కపటవినయము, మోసము, హత్యాప్రయత్నముల నెఱుంగరుగదా!!

ఢిల్లీ సామ్రాట్టునకు, అయోధ్యానవాబునకు, పంజాబు ప్రభువునకు, ఝాన్సీ రాణికిని, నాగపూరుపాలకుఁడు అప్పా సాహెబునకు–వీరలకేగాక, సిక్కిమ్, సంబల్–ఇట్లే అన్ని స్వదేశసంస్థానములును కంపెనీపాలకులకుఁ జిక్కువడినవి. అంత టను మోసమే ప్రధానకృత్యముగా నయ్యెవి లోఁగిపోయి నవి. మోసమెఱుఁగని నాదేశవాసులకు జరిగినయన్యాయ మెన్నటికైనఁ దుడిచివేయఁబడక తప్పదు. అట్లు కావింపు టలో నెన్ని యితరప్రాణులు నాశనమైనను లెక్క చేయఁ గూడదు. మోసమును మోసముచేతనే జయింపవలె, ముల్లును ముల్లుతో నూడఁబెఱుకవలెఁ గదా!

నాజకుఁడు బాజీరావుపీష్వాకు సాలునకుఁ గోటిరూప్య ములు ఆదాయము వచ్చు జమీను తమస్వాధీనము గావించు కొని, యెనిమిదిలక్షలుమాత్రము రాజభృతిగా నిచ్చుట కంగీక రించిన కంపెనీవారు, అతనియనంతర మాతనిదత్తపుత్రకుమా రుఁడనగు నాకు నాభృతిద్రవ్యము నిచ్చుటకుఁగూడ నంగీక రింపరైరి. కంపెనిలోని పైయధికారులకు నపీలు గావించుట యను నెపముతో నామంత్రి నింగ్లాండునకుఁ బంపియుంటిని. నాప్రధాని అజీముల్లాఖాను తంత్రావాపములు నడుప సమ ర్థుఁడు గదా!

ఇంగ్లాండు ప్రయాణముసందర్భమున నతఁ డిటలీలోఁ గొన్నిదినములు లాఁగియున్నట్లు వార్త వచ్చినది. అట నిచ్చటి నాప్రయత్నములకుఁ గొంత సాహాయ్యమునకుఁ జేయూఁత

దొరకి యుండవచ్చును. నేఁడో రేపో పిమ్మట విషయములఁ గూర్చి వార్త రాఁగలదు. వానిని సమగ్రముగ పరిశీలించిన పిమ్మటనే యొక కార్యనిశ్చయముఁ జేసెదఁగాక.''

ఈవిషయ మంతయు నటు జల్లిపడుచున్న గురూజీకి మనస్సుతోడనే విన్నవించుటకు చిహ్నముగా నారాయణుని మూర్తి ప్రతిమను సవినయముగా సమ్ముఖమున జోహారు లర్పించినాఁడు. తలయెత్తి చూచునప్పటికి కా విగ్రహము ముందొక రోజాపుష్ప ముండుటఁ గాంచినాఁ డాతఁడు. అయ్యది గురూజీ యాతని నాశీర్వదించుచు నిచ్చిన భావికార్యసిద్ధి సూచక మనుటకు సందేహము లేదు. ఒక సందర్భము ననుసరించి, యటఁ జేర్పఁబడిన కుసుమ మది యన యతఁ డారయు గుట కెంతయో కాలము పట్టలేదు.

అతఁ డొక సంకేతము గావించినాఁడు. తక్షణమే యొక పెద్దమనుష్యుఁడు గదిలోఁ బ్రవేశించినాఁడు.

వెనుకముందులు పింజలు తీర్పఁబడిన కట్టుపంచె; మోకాళ్ళవఱకు వ్రేలాడుచున్న అంగరకా; ఒక భుజము మీఁదినుండి వేఱొక భుజముమీఁదకు నడుముఁ జుట్టి త్రిప్పి వైచికొనిన జలతారుత్తరీయము; వామదక్షిణములుగ జరీ మడుపులు కన్పట్టునటుల చుట్టిన తలపాగ, నుదుట స్పష్టముగాఁ గానవచ్చు మూఁడు గంధపు రేఖలమధ్యనున్న కుంకుమబొట్టు; భ్రూమధ్యమున లక్ష్యాలక్ష్యముగనున్న వేఱొక చిన్న బొట్టు.

హైందవత్వ మట్టిపడుచున్నట్లున్న యాతఁడాయు త్తర క్షణమున ఆసనాసీనుఁ డగువానిచే మహారాష్ట్రసాం ప్రదాయానుసారముగా 'రాం రాం' యనుచు నిరుపార్శ్వ ముల నాలింగితుఁ డైనాఁడు. ఆసీనుఁడైన యతనితో నిట్లు సంభాషణము ఆరంభమైనది.

"రంగో బాపూజీ! ఇంగ్లాండున మనవ్యవహారము లెట్లు నడచుచున్నవి ?"

"పీష్వాజీ! మన వ్యవహారములు మన భూఖండముపై పరిష్కారములు కావలయునే కాని ఇంగ్లాండున అగున దేమియు లేదు."

"అజీముల్లా సందేశ మెట్టిది ? ముందాతఁడు సూచించు చున్న కార్యవిధాన మెట్టిది ?"

"అద్దానిఁ దమకు విన్నవించుటకే నేనిటకు స్వయ ముగా నేతెంచితి."

"నిరభ్యంతరముగా తెలుపియవచ్చును రహస్యమందర మిది యని తమరు తెలిసికొనియే యున్నరు గదా!"

"అజీముల్లా రష్యాపయనమైన నున్నాఁడు."

"జారుచక్రవర్తియొద్దకా ?"

"అవును. ఇటలీలో నేను గారిబాల్డిగారితో మాట్లాడి వచ్చుట అజీముల్లాగారి సలహాయే. రష్యా గోరంత చేయూఁత నిచ్చెనో యింక మనకార్యము సగ్గము సత్వరముగ నెర వేఱినట్లే."

ఇట్లు యిరువురు నింక నెన్నియో విషయములం గూర్చి యెంతయో తడవు ముచ్చటించుకొనిరి. ఇం దొకఁడు బాజీరావు దత్తపుత్రుఁడు; ఇంకొకఁడు ఇంగ్లాండునుండి తిరిగివచ్చిన రంగోబాపూజి అని తెలియుచునేయున్నది కదా! ఇంక వారలు గావించుకొనిన నిశ్చయ మేమని తెలియ నుత్సాహపడుచున్నారు కదా మీరలు ?

విప్లవము లేవఁదీసి, ఒకనిర్ణీతతిథినాఁడు, తెల్లవారి నందఱను నఱికివైచి, ప్రభుత్వము హస్తగతము గావించు కొనుటయే వారి తుదినిశ్చయము. ఇందుకు దేశీయసైనిక పటాలములే సాయపడ శక్తిగలవి. కావున తెల్లదొరల యన్యాయమును పటాలములవారికి ప్రబోధించి, నిర్ణీతదిన మున ప్రభుత్వము కైవసము గావించుకొన నాదేశించుట జరుగవలెను. అంతయు ప్రచ్ఛన్నముగా జరుగవలసి యున్నది. రహస్యము బట్టబయలు కాఁ గూడదు.

గ్రామ ప్రజ లీయుద్యమమునకు సుముఖులు. ఇంక, పటాలప్రబోధము సునిగూఢముగా జరుగవలసి యున్నది. గ్రామ గ్రామమున మఠములు వెలసినవి. ఇవియ్యవి, విప్లవ ప్రచార కేంద్రములు-అభిమానులగు గ్రామీణులు సాత్వికులు-రెండర్థములు గల పాటలు పెక్కులు కూర్పఁబడినవి. ఈపాటలే విప్లవప్రచారమును తీవ్రతరము గావించినవి.

పాఠకులారా! బాజీరావు నాశ్రమవృత్తాంతమును మేము దిఙ్మాత్రముగా సూచించితిమి. ఆశ్యావర్తనమున నాంగ్ల

దేశీయులయెడ ద్వేషము ప్రబలిపోయినది. జోన్యపంచకము వ్రాసిన వ్రాత దేశమున మూలమూలలవారికిఁ దెలిసిపోయినది. అదేమిచిత్రమో కాని, సన్నిహితభవిష్యత్తులో నాంగ్ల పరిపాలన మంతరింపఁగలదని యందఱు విశ్వసింప మొదలిడినారు. విదేశీయుల పరిపాలనము కూలఁ ద్రోయుటకు దేశ వ్యాప్తముగా ప్రయత్నములు జరుగుచునే యున్నవి. అంతయు తెరచాటు కథయే. ఇట్టి రహస్యవృత్తాంతము సాధారణముగా యువకుల నెక్కువగా నాకర్షించినది. జీత బత్తెముల కాశింపకయే ప్రచారోద్యమమునకుఁ బెక్కురు యువకులు తమ సాహాయ్యము నిచ్చినారు.

దేశమున నానందమఠము లెక్కువ కాఁజొచ్చినవి. ఇందలి వ్యక్తులు, చూచువారలకు బుక్కాఫకీరులవలెఁ గాన వచ్చెడివారు. కన్యాకుమారినుండి కాశ్మీరమువఱకు నేదే నొకవార్త ప్రచార మగుటకు నొక నెలదినములు పట్టున దనిన నారహస్యసంఘముల యంతస్సంజ్ఞ లెవ్వరి కర్థము కాఁ గలవు ? ప్రచారము సామాన్యప్రజలలోకంటె మిలటరీశాఖ లలో నెక్కుడుగాఁ జేయవలసివచ్చినది. అటులు చేయఁ బడినది.

ఒక్కమీాట నొక్కుటచే బ్లాకుదీపము లన్నియు వెలుఁగు నట్లుగా సంకేతముచే ప్రభుత్వమును స్తంభింపఁ జేయుట కేర్పాటులు గావింపఁబడినవి ఈప్రచారమున జాతి

మత విచక్షణ లంతర్హితము లైనవి. "తెల్లవారితో నల్లవారికి వైరము" ఇయ్యదొక్కటే మూలసూత్రము. అవమానము సమానముగా జరిగినట్లే యెంచుకొనఁబడినది. చీల్చి పాలించు స్వభావముగల తెల్లదొరలకు జాతిసమైక్యత యొక్కటే మహాసూత్రము కదా!

స్త్రీలు, బాలురుఁగూడ ఆనందమఠమునఁ జేరి వచ్చినారు. ప్రచారప్రబోధకులకు రాత్రులు పగళ్ళుగాను పగళ్ళు రాత్రులుగా నుపయోగపడినవి. మనుజుని దేహమున నుంచి నెత్తురు మోసికొనిపోవు నాడులు కొన్ని చెడురక్తమును మోసి తెచ్చు నాడులు వేఱొకకొన్ని యుండునట్టుల, ప్రచారమును దేశమున మూలమూలలకుఁ గొనిపోవు సంఘము వేఱు; ఎచట నెంతవఱకు ప్రచారము గావింపఁబడినదో తెలిసికొని, విప్లవ కేంద్రమునకు వార్తలు గొనివచ్చు సంఘము వేఱొకటి, ఇఁక, దేశీయపటాలములలోఁ బ్రచారము కొనసాగించు సంఘము మూఁడవది.

ఇందు, పటాలములలోఁ బనిచేయువారే పెక్కుమంది చేరుటచే ప్రచారము తీవ్రముగా కొనసాగినదని చెప్పవచ్చు. బిఠూరున నవీనుఁడుగానున్న నానాకు పదివేలకన్ను లున్నవని విప్లవప్రబోధకులే చెప్పుకొనుచుండువారు.

ఇట్టి విప్లవప్రచారనాయకుఁడు ప్రభుత్వమునకును కుడిభుజముగా నుండుట వింతలలోనెల్ల గొప్పవింత గదా!

---

## ౧౩

## పొగ కానవచ్చినది

ఒకనాఁ డొక విప్లవగూఢచారి మైసూరునకుఁ బోవు త్రోవలోఁ బ్రభుత్వముసిబ్బందిచేఁ బట్టువడినాఁడు. అతనియొద్ద కొన్ని కరపత్రములు లభించినవి అతని, నధికారులయొద్దకుఁ గొనివచ్చినారు. అధికారి వాని నిట్లు ప్రశ్నించినాఁడు.

‘‘నీ వెవ్వరి వేగులవాఁడవు?

‘‘మాతృదేవత దూతను నేను. నా పేరుతో నాకే పనిలేదు; తమ కేల?’’

‘‘మఱి యీ కరపత్రము లెక్కడివి?’’

‘‘పొట్లముల కుపయోగించు నా పనికిమాలిన కాగితములకు మీ రేదియో క్రొత్తనామకరణము గావించినారు! నా కయ్యది బోధపడుట లేదు.’’

‘‘అయ్యవి నీదగ్గఱ నుండనేల?’’

‘‘మీబోంట్లెవ్వరో బజారునఁ గుమ్మరింపఁగా నే నెత్తి తెచ్చికొంటిని. తమ కయ్యవి యుపయుక్తము లని తోఁచినచో తామె గైకొనవచ్చును.’’

‘‘ఈ కరపత్రములలోని విషయమునకు నీకును దగ్గఱ సంబంధము గలదని మే మూహించుచున్నాము.’’

"మీ మాయాసంభాషణాదికము విన్నవా రెవ్వరైన, దాని కొకయంతరార్థము గలదని నుడువుదురో నీ సద్వాని కెట్లు బాధ్యుఁడ నగుదునో నాకుఁ దెలియుట లేదు."

"నీ వాక్చాతుర్యముఁ గట్టిపెట్టి నిజము చెప్పెదవా లేదా ?"

"అమాయకుల నెందఱను మీ భటులు సెంద జెయిళ్ల నిర్బంధించుచున్నారో తా మెన్నఁడైన విచారించినారా ?"

"ఎవరురా అక్కడ ? ఈతనిని భద్రముగాఁ గాపాడు చుండి యవసరమైన యప్పుడు పై యధికారులయొద్దకుఁ గొనిరండు."

ఈ విచారణము గావించినవాఁ డొక జిల్లాయధికారి. భద్రపఱచునది అని యాతని యాజ్ఞయైనచో నాతని కింక భద్రతయెక్కడిది ? వీపు చీరి సున్నము పెట్టినారన్నమాట. పోలీసు కోశములో నామాటల కదియే యర్థము.

బాధ్యతగల జిల్లాయధికారి యిట్టియుదంతములను పై యధికారులకుఁ దెలియఁజేయక యెట్లూరకుండఁగలఁడు ? రాజప్రతినిధివఱకు నెక్కిన దావార్త. రాజప్రతినిధికి దేశమున నింకను గొన్నిచోటులనుండి యిట్టివార్తలే యేతెంచినవి. పంజాబురాష్ట్ర గవర్నరుకు నొకసారి సిమ్లా వచ్చి మాట్లాడి పోవలసినదిగా వార్త నంపించినాఁడు. క్షణములో నూడిపడినాఁ డాతఁడు. రహస్యసమాలోచన గావించి విప్లవమునకు విరుగుడుగా నొక చక్కనిపద్ధతి నిర్ణయించుకొన్నారు వారు.

ఆమఱుచటిదినమున రాజప్రతినిధి యొకయసాధార ణము, అత్యవసరము నగు ప్రకటనఁ గావించినాఁడు.

"క్రొత్త తోటాలను సైనికు లెవ్వరు నుపయోగింప నక్కఱ లేదు. వాని నే యుపయోగింపుఁడని సైనికుల నెవ్వ రేని నిర్బంధించుచో నట్టివారు తీవ్రమైనశిక్షలకు గుఱి కాఁగలరు. తమయిష్టానుసారము సైనికులు తోటాలను తయారు గావించు కొనవచ్చు" నిది యీప్రకటనపాఠము యొక్క సారాంశము.

పంజాబుగవర్నరు సర్ జాన్ లారెన్సు సిమ్లాసమావేశ మునకుఁ బిమ్మటి దినమునఁ దనరాజధానియందంతటను గొప్ప సమావేశముల నేర్పాటు చేయించినాఁడు. మహమ్మదీయులు సిక్కులకుఁ గావించిన ద్రోహముల పెక్కింటి నచ్చొత్తించి. యీసభలలో నందఱకుఁ బంచిపెట్టించినాఁడు. మఱియు నందు ఔరంగజేబు ఢిల్లీలో గురు తేజబహాదూరుశిరస్సు కోయించిన చిత్రముగూడ చిత్రింపఁబడినది. ఢిల్లీపాదుషాపైఁ బగఁ దీర్చు కొనుటకు తగిన యదనే కేంచినది. ఇంగ్లీషువారల చేయూఁత మీకవసర మగుచోఁ బ్రభుత్వమందుకు వెనుదీయఁబోవుట లేదు—అనువిషయము గూడ నందుఁ బొందుపఱుపఁబడినది. కేవలము పచ్చియబద్ధముగూడప దేపదే ప్రచారము చేయుచో సామాన్యప్రజాసముదాయమున నయ్యది త్రికాలసత్యముగా నెంచఁబడు చుండును. బాధ్యతగల రాజకీయపీఠము నుండియే

యిట్టి మిథ్యాప్రచార మారంభమగుచో, సిక్కు సద్దాని ప్రభావ మనల్పముగదా !

విప్లవకారుల ప్రచారము పంజాబు నాకర్షింపజాలక పోయిన సంగతి నానా తన దేశయాత్రావసరమునఁ దెలిసి కొనఁ గలిగెను. ఈ విషయమును బహదూర్ షా సమక్షమున విన్నవించినాఁడు. ఆతఁడును స్వకస్తాక్షరను ప్రత్యేకముగాఁ బంజాబునకుఁ బంపినాఁడు. సిక్కులు విప్లవముఖులని గూఢముగాఁ దెలియఁబఱచినాఁ డాతఁడు.

పంజాబు రైతులనుండి యీ రాష్ట్రిగవర్నరు, హెచ్చువడ్డీకి కంపెనీపేరిట నప్పులు గైకొనినాఁడు. ఈ విధముగా కంపెనీని, ప్రతిపౌరుఁడు తనకు బాకీదారుగా నెన్నుకొను చున్నాఁడు. ఇట్టి స్థితిలో నచటఁ బ్రభుత్వమునకుఁ బ్రతికూలముగాఁ దిరుగుటకు సుముఖుఁడగువాఁ డెవ్వఁ డుండును ?

కొన్నాళ్ళకు కొంతిబలములతోఁ గొన్ని సందేశములను ఢిల్లీబహదూర్ షా యాజ్ఞానుసారము పంజాబునకుఁ గొని రాఁబడినవి.

తమకు బాకీదారుగా నెన్నుకొనఁబడుచున్న కంపెనీ ప్రభుత్వముతో స్పర్థ పెట్టుకొనుట కట నెవ్వరు నంగీకరింప లేదు. మీఁదు మిక్కిలి సందేశహారుల చావఁ గొట్టిరి. వారలఁ గూర్చిన వార్తయు తిరిగి ఢిల్లీకి చేరలేదు.

---

# ౧౪

## జై ! స్వతంత్ర భారత్

అవధ దేశమును కంపెనీ రాజ్యమునఁ గలుపుకొను టతో విప్లవము స్థిరపడినది. 1857 సంవత్సరము విప్లవము నంతటికిని, ఢిల్లీ లాల్ ఖిల్లా ముఖ్య కేంద్రము. సమ్రాట్ బహదూరుషా పేరుతో స్వతంత్రభారత సామ్రాజ్యస్థాపన చేయుటకై నిశ్చయింపఁబడినది. బహదూరుషా సమితిని చే గంజీనత్ మల్ మౌలాపీ అహమద్ షా, ఖాన్ బహదూర్ ఖాను ముఖ్యసలహాసభ్యులుగ నుండిరి. నవాబ్ వాజద్ అలీషా వజీర్, అజీమఖీఖానులు విప్లవ ప్రధానసంచాలకులు. బేగమ్ హజరత్ మహల్, దేశీయులను విప్లవనాయకులనుగా తయారు చేయుట కారంభించినది. హిందూవులు పవిత్రమగు గంగా జలముల ముట్టియు, మహమ్మదీయులు ఖొరాన్ గ్రంథము పైనఁ జేయివైచియు స్వాతంత్ర్యయుద్ధమునఁ బాల్గొనుటకుఁ బ్రమాణములు గావించినారు. ఈ ప్రచారమునఁ బాల్గొనని, మౌలావీలు గాని పండితులుగాని లేరనుట అతిశయోక్తి కానేరదు.

అజీముల్లా దేశమునకుఁ దిరిగివచ్చుటతో, నానాకు బలమధికమైనది. 1857 మార్చి నెలలో తీర్థయాత్ర యను మిషతో నానా స్వయముగా విప్లవప్రచారమునకై బయలు దేఱినాఁడు. ఆతని సోదరుఁడు బాలాసాహెబునకుఁగూడ

నతనితో దేశమం దన్ని చోట్ల ఘనమైన స్వాగతము లీయఁ బడినది. సైనిక కేంద్రము లన్నియుఁ దిరిగి ప్రచారము గావించినాఁడు. సైనికపటాలములలో నీళ్ళు మోసి వంట వండువారలుసైతము, ప్రచారోద్దేశముల నందుకొని విప్లవ మున తమశక్తికిఁ దగినసాయము చేయుటకు నిశ్చయించు కొని యుండిరి. కాని, ఈ ప్రచారపు విషయము ఆంగ్లేయాధి కారులకు నావంతయు తెలియరాదయ్యె.

విప్లవ ప్రచారకులకు గుఱ్ఱములు ఏనుఁగులుగూడ సరఫరా చేయఁబడుచుండెను. వారికి సంరక్షణార్థము శస్త్ర రక్షకభటులు సైతమన్ని చోట్ల నుండెడివారు.

విప్లవ ప్రచారమునకు బొమ్మలాటలు, వీధినాటక ములు, వీధిగారడీలు హెచ్చుగా నుపయోగించువారు. వీని నాధారముగా జనాకర్షణము గావించి తా మూహించిన ప్రచారము సాగించెడివారు. ఇట్లింత నిగూఢముగా ప్రబో ధము గావించినను ఒకటి రెండు చోట్ల నీప్రచారకులు ప్రభుత్వమువారిచేఁ బట్టుపడుటకూడ తటస్థించినది. విప్లవముఁ జేరుట కంగీకరించుటకు రెండు సాంకేతికము లేర్పరచికొని నారు. సిపాయీలు నెఱ్ఱని తామరపుష్పము చేతితోఁ, దాఁకుట, గ్రామస్థులు రొట్టెనుకొంచెము తాము తిని, ప్రక్క గ్రామము పంచాయితీదారున కద్దానిని బంపుట-ఇయ్యది ప్రచారస్వభావము.

నానా అంబాలా వెళ్ళినపుడు ఘనమైన స్వాగత మీయఁబడినది. ఏప్రియల్ (April) 18 తేదీకి లక్నోనగ

రము చేరినాఁడు నానా. 1857 మే నెల 31 తేదీ ఆదివార మున భారతమునఁ బెల్లపుదుగు మిగులనీయఁగూడ దని ప్రచారమున నుపదేశింపఁబడినది

విప్లవము చెలరేగుటకు మఱొక సంఘటన జరిగినది. ప్రభుత్వమువారు సిపాయీ లుపయోగించుటకుఁ గ్రొత్త రకము తోటాలు తెప్పించిరి. అయ్యవి నిజముగా నెట్టి పదార్థముతోఁ దయారు గావింపఁబడినవో, యెవరో దైవ మొక్కనికే తెలియును; కాని పటాలములలో నయ్యవి పంది క్రొవ్వుతోను, ఆవు తోలుతోను తయారు గావింపఁబడిన వనుమాట ప్రచారములోనికి వచ్చినది. దానితోఁ బ్రభుత్వ ముపై ద్వేషము మఱింత హెచ్చినది. కేవలము రాజకీయ ముగా సాగవలసిన యీవిప్లవము భారతదేశమునకు మతాప చారము జరుగుచున్న దనుమాట తోడై భగ్గున మండినది. దాని నార్పుట భగవంతునకుగూడ నశక్యము. అంతియే కాదు; నానా ప్రభృతిమహానాయకులు నిర్దేశించిన మే నెల 31 వఱకుఁగూడ సైనిక పటాలములలో విప్లవము బ్రద్దలు కాకుండ ఆఁప సాధ్యము కాలేదు.

18-7 మే నెల ఆఱవ తేదీని మీరట్టునగరమున తొంబది రౌతులుగల యొక పటాలమునకు నీ క్రొత్త రకము తోటాలనిచ్చి వానిని నోటితోఁ గొఱకవలసినదిగా జనరల్ ఆజ్ఞాపించినాడు. అందు 57 మంది యాయాజ్ఞ నుల్లంఘించి నారు. శాసనము రిత్తవోవుట కే జనరల్ అంగీకరించును?

కాఁగా, నా శాసనోల్లంఘనము గావించినవారికి సైనికదుస్తులు లాగికొని నిలువుశేసీలు అడ్డుశేసీలు వేయించి, కవాతు మైదానమున నన్ని పటాలముల వారియెదుట వారికి 10 యేండ్లు కఠినశిక్ష విధించి నటులఁ బ్రకటింపఁబడినది. వారిని జైలున కంపించిరి. దాననీ సిపాయిలోక మంతయు, భగ్గున మండిపడినది. వారు తాల్మిఁ గోల్పోయినారు. "క్రుద్ధో హన్యాద్గురూనపి" క్రోధావేశితుఁడు గురువునైన లెక్క చేయఁడుగదా!

మే నెల 10 లేక 11 తేదీలలో మేమందరము ఢిల్లీకిఁ జేరవచ్చుచున్నామని తొమ్మిదవ తేదీననే ఢిల్లీకి మీరట్ నుండి విప్లవ సంఘమువారంపిన వార్త చేరినది. 10 వ తేదీ ఆదివారము. సూర్యోదయమునకే మీరటు నగరము జనసంకులమైపోయినది. సైనిక శిబిరవాసులు సర్వసంసిద్ధులై యుండిరి. ఆరాత్రి ముందుగా జైలుదిశగా నడచిన దా విప్లవము. జైలర్లు విప్లవనాయకులతో నేకమైనారు. బందీగాలు విముక్తులైనారు. మీరటునగరమునఁ గానవచ్చిన తెల్లవారలు, ప్రాణములతో వదలఁబడినవారు గుఱ్ఱములు తిను గడ్డివామి మాటునఁ గొందఱు, మురుఁగుకాల్వల తూములలో దాగికొని కొందఱు, భారతీయుల కాళ్ళు గడ్డములు పట్టుకొని బ్రతిమాలి కొందఱు ప్రాణముల సంరక్షించుకొన్నవారు లేక పోలేదు. ఆరాత్రియే విప్లవసైన్యము ఢిల్లీకి బయలుదేరినది. "మీరట్ నగర మాంగ్లదాస్యమునుండి విడిపింపఁబడినది. "సామ్రాట్ బహదూర్ షాకు జై" యనునినాదములతో,

ఢిల్లీ కోటలో సైనికు లడుగు పెట్టినారు. ఆంగ్లేయ సేనాను లందఱు యమపురిలో ప్రాతకాఁపులుగాఁ జేయఁబడిరి.

లాల్ ఖిల్లా విప్లవకారుల వశమైనది. బహాదూర్ షా, బేగమ్ అజీనత్ మహల్, మొదలుగాఁ గల నాయకు లత్యవసర సమావేశము జరిపినారు. అనుకొనకుండ నేర్పడిన యీ యసాధారణపరిస్థితులలో నింక నీవిప్లవమును 31 మే వఱకు నాపియుంచుట అనవసర మని తీర్మానించుకొన్నారు. బహాదూర్ షా విజయచిహ్నముగా. నిరువదియొక్క మాఱు ఫిరంగులు మోగింపఁబడినవి ఢిల్లీ పౌరులు సిపాయీలకు మధురరసములఁ ద్రాగనిచ్చిరి.

ఢిల్లీ శస్త్రశాలాధికారి విలోబి. ఆతనికి శస్త్రశాల నొప్పగింపవలసినదిగా బహాదూరుషా అజ్ఞాపించినాఁడు; కాని యాతఁ డంగీకరింపలేదు. నేల యీనినట్లుగాఁ బొంగి పొరలి వచ్చు నామహావిప్లవము నెదుర్కొనుట యసంభవ మని విలోబికిఁ దోఁచినది. వెంటనున్న హిందూస్తానీ సైనికులు విప్లవకారులలోఁ జేరిపోయిరి నీరు నీరువంకఁ బ్రవహింపదా మఱి! విలోబి, తనయొద్ద మిగిలి యున్న యాంగ్ల సైనికులను మందుకొట్టునకు నిప్పు నంటించుఁడని యాజ్ఞాపించినాఁడు. చేయునది లేక వారలట్లే కావించిరి. దానితో నాయాజ్ఞఁ గావించిన విలోబి. యాజ్ఞ నిర్వర్తించిన ఆంగ్ల సైనికులు, మఱియు నాసమీపముననున్న మూఁడువందల సాధారణ కుటుంబీకుల యిండ్లన్నియుఁ గూడ భస్మీభూతము లైనవి.

ఇట్టి సంఘటనములు రాజకీయములలో ముఖ్యముగా, సైనికవ్యవస్థలో పెక్కులు సంభవించుచుండును. ఇట్టి రాజనీతి విద్య ఆంగ్లేయుల కుగ్గుబాలతో నేర్పఁబడినయట్టిది. తాదృశ సంకటస్థితిలో నంతకంటె నాశము గావించునది లేదు; కాని, విలోభిసి ప్రలోభింపఁజేసి ముందుకొట్టును వశము గావించు కొన్నచో, నప్పటికథ యెట్లులుండునదో ?

విప్లవకారులకు ప్రధాననీతి యొక్కటి కలదు. ఇతరులను వారు ప్రలోభింపఁ జేయరు-ఇతరులచేఁ బ్రలోభింపఁ జేయఁ బడరు. స్వశక్తిసామర్థ్యప్రకటనమే వారల పరమలక్ష్యము.

---

## ౧౨

## అలవిగాని పని

నాఁటి స్వాతంత్ర్యయుద్ధమునకుఁ గాన్పూరునగర మొక ఆయువుపట్టు. ఈమంత్రాంగమునకు నాయకుఁడైన దుంధూ పంత్ నానాసాహెబు, నిర్దిష్టసమయమునకై యెదురు చూచు చున్నాఁడు. ఆతనికి మఱి యైదు బాహ్యప్రాణములు కలవు. అతని సోదరులయిన బాలాసాహెబు. బాబాసాహెబులు; నానా సోదరపుత్రుఁడైన రావుసాహెబు; వీరవరాత తాంతి యూతోపే; అజీముల్లాఖాన్. వీర శ్రీప్రాంతమునఁ గావించిన ప్రబోధఫలితముగాఁ బ్రజల తిరుగుబాటు నుద్రేకమును

చేతులపై నాపవలసివచ్చినది. దీనికిఁదోడుగా ఢిల్లీ స్వాతంత్ర్యము నొందెనన్నవార్త మే నెల 15 తేదీకి కాన్పూరు నకుఁ జేరినది. ఇఁక నేమి? అగ్నికివాయువు తోడైనట్లయినది.

మొదటఁ గావించుకొనిన సంకేతదినమువఱకు ప్రశాంతముగా నుండునట్లు చూచుట విప్లవమునకు మూలకందమైన నానాసాహెబునకు ధర్మముకదా! పాప మాతఁ డట్లే సంకల్పించియున్నాఁడు కానిభవిష్యత్తు కడు బలవత్తరమైనదికదా!

బిఠూరులోఁ దన భవనమున నానా అతిదీర్ఘముగా నాలోచించుచుఁ గూర్చున్నాఁడు. ఒక వార్తాహరుఁ డేతెంచి, జాబు నొకదాని నందించి వెడలిపోయినాఁడు. అతఁ డద్దానిని విప్పి చదువుకొని తనలో నిట్లు తలపోయఁదొడఁగినాఁడు.

"ఆంగ్లేయుల కీ దేశమున నుండుట కేమిహక్కు గలదు? ఈ పవిత్రభూమిపై జన్మించిన మేము స్వాతంత్ర్యముఁ గోరుట రాజద్రోహమా? కాన్పూరును సంరక్షించుటలో మేము ఆంగ్లసైనికులకు సాయపడవలయునఁట! ఏముఖముతో హ్యూహీలరు ఈ జాబు వ్రాసియున్నాఁడు? విప్లవము ముంచెత్తుకొని వచ్చుచున్నదని యిప్పటికిఁ దెలిసివచ్చినది. ఆంగ్లేయుల నివాసభవనము లన్నియు నిప్పటికే యగ్గిపాలైనవి. నేఁడింకను మే నెల 15 వ తేదీయేకదా! మఱి పక్షముదినముల వఱకు మన యీ దేశభక్తుల నాపియుంచుట బ్రహ్మయంతవానికిని దరము గాదు. ఇఁక నిట మూలఁ గూర్చుండి ప్రయోజనము లేదు. కాన్పూరున కేగెదఁగాక!"

కాన్పూరున నడుగుపెట్టుట తడవుగా సర్ హ్యూహ్వీ్లరు వచ్చి నానాను కలిసినాఁడు. ఈ సంభాషణ జరిగినది.

"నాజాబు చూచుట తడవుగా వచ్చినందుల కెంతయుఁ గృతజ్ఞుఁడను."

"నేనే రావలయు ననుకొనుచున్నాను. ఇంతలో మీ జాబు, నే తెంచినది. ఇందుఁ గృతజ్ఞతతోఁ బనిలేదు."

ఢిల్లీ వార్తలు విన్నారుకదా! 24–వ తేదీలోపల విప్లవము చెలరేగఁగలదని పట్టణ మంతయు గలంచుచున్నది"

"అగును, నిజమె. నేనును విన్నాను."

"మఱి మీరు మందుగొట్టును ఖజానాలు మీస్వాధీనములో నుంచుకొని సంరక్షింపవలసినదిగాఁ గోరుచున్నాను. ఒక పటాలమును పంపుమని లక్నోకు వ్రాసియున్నాను. రేపో మాపో వారు నిచటకి రాఁగలరు."

"సరే, రానిండు. నాకు నొప్పగించిన పాసిసి భద్రముగా నుంచుటయే కదా నావిధి."

*　　　*　　　*　　　*

24–వ తేదీకి క్రిందటదినమే లక్నో సేన, కాన్పూరు చేరినది. హ్వీలరు గుండెదడ సర్దుకొనినది. 24–వ తేదీ తెల్లవాఱినది. నగరమున నెచటను గొందఱలు లేవు; కాని, నగరమునఁగల ఆంగ్లకుటుంబములన్నియు, హ్వీలరు క్రొత్తగా కట్టించిన కోటలోనికిఁ జేర్పఁబడినవి. 24–వ తేదీ రాత్రి గడ

చినచో బ్రతికి బయటఁబడినట్లుగా నాంగ్లేయు లందఱు తలం చినారు. 25–వ తేదీ వచ్చినది. అందఱిముఖములు కలకల లాడినవి. హీ్వలరు నెల చివరవఱకు జాగ్రత్తగా నుండవలయు ననుకొన్నాఁడు. అట్లే ఉన్నాఁడు. 30–వ తేదీన లక్నో సేనను తిరిగి లక్నోకు పయనముచేయించినాఁడు. "కాన్పూరు సురక్షితముగా నున్నది. జూను ఒకటి రెండు తేదీలలో లక్నో వచ్చుచున్నా" నని వర్తమానమంపినాఁడు.

జూన్ 4–వ తేదీ అర్ధరాత్రి యకస్మాత్తుగా "ఢాం" "ఢాం" "ఢాం" అని మూఁడు ఫిరంగులు మ్రోఁగినవి. సుబేదార్ టీకాసింగు గుఱ్ఱము నెక్కి ముందు నడచినాఁడు. విప్లవసైన్యకోలాహల మధికమైనది. ఎచటఁ జూచినను "మారో ఫరంగీకో" జైశంకర్ హార హార మహాదేవ్" అను నినాదములు పిక్కటిల్లినవి. నానా సైన్యములు విప్లవ కారులలోఁ గలసిపోయినవి. ఈనినాదములకు మేల్కొనిన ఆంగ్లేయులు పంచాగ్నిమధ్యమున నున్నవారలనుగా తమ్ముఁ దాము గుర్తించికొన్నారు. తలయెత్తి యెటుచూచినను స్వాతంత్ర్యపతాకములు వారల కండ్లయెదుట తాండవించి నవి. ఆంగ్లేయనివాసములన్నియు భస్మావశేషము లైనవి.

5–వ తేదీ ఉదయమున "నానామహారాజ్‌నకు జై" యను జైత్రకోలాహలములతో నేనుఁగుపై స్వతంత్రపతా కము నూరేగించి ప్రతిష్ఠించుట జరిగినది. నగరమున ప్రశాంత పరిస్థితి నెలకొనినది.

హీ్వలరు కట్టించిన కోటలోనున్న యాంగ్లేయుల హృదయము కోట వెలుపల మ్రోగుచున్న ఫిరంగుల మ్రోతకు దద్దరిల్లిపోవుచున్నవి. వారికి మఱియొక దుర్గతికూడ సంభవించినది. త్రాగుటకు కోటలో నీరు లేదు. వెలుపల శత్రువుల పహరా. కోటలోని వార్త వెలుపలకుఁ బోవ వీలు కలుగదు. వెలుపలనుండి యింకగకూడ లోనికి రా వలనుపడదు. బాలురు, వృద్ధులు, స్త్రీలు-అందఱు వచ్చి హీ్వలరును చుట్టుకొన్నారు. ఆ రోదనముల నెట్లు శాంతింపఁ జేయవలయునో యాతనికిఁ దోఁచినది కాదు. ఎంతటిధీరచిత్తునకు నంతమంది భీరువులు చుట్టుముట్టి యేడ్చుచో మనస్సు చలింపకుండు టెట్లు ?

హీ్వలరునకు నప్పటికిఁ దోఁచిన దొక్క-టే యుపాయము. భగవత్ప్రార్థన చేయుఁ డని వారలకు బోధించినాఁడు. లక్నో సేనాసన్నివేశాధకారికి సాయము పంపవలసినదిగా నొక జాబు వ్రాయ నూహ కల్గినది హీ్వలరునకు

అతఁడు కలము చేఁబూనినాఁడు: కన్నీటిధార చే కాగితము తడిసిపోయినది. వేఱొక సారి ప్రయత్నించినాఁడు, చేయి వణఁకిపోయినది. అతికష్టముతో నాల్గువాక్యములు గిలికినాఁడు. అయ్యది ఇంగ్లీషు, లాటిను, పార్శీమాటల సంపుటిమాత్రమే. అంతటను సాయము, సాయము, సాయము. అనునర్థమువచ్చు మాటలే కాని సంపూర్ణవాక్య మొకటియు నందు లేదు. మఱి యయ్యది లక్నో నగరమునకుఁ జేరు టెట్లు?

హీ్వలరునొద్ద నొక భారతీయ నౌకరు గలఁడు. అతనిలో నితనికి దైవము గోచరించినాఁడు. ప్రార్థించినాఁడు. ప్రాధేయ పడినాఁడు. ఆశ గొల్పినాఁడు. ఎట్టకేలకు కాతఁ డా సందేశ వాహకత్వమున కొడంబడునట్లు గావించినాఁడు. ఆతఁ డూహించిన రీతిగా లక్నోకు వార్త చేరినది. హీ్వలరు మొదట దైవ మాలకించినాఁడు కాఁబోలు!

కానుపూరు తిరుగుబాటున మగ ఆఁడ అని కాని లేక హిందూమహమ్మదీయు లని కాని విచక్షణ లేకయే అందఱు ఆంగ్లేయులపై యుద్ధము చేయ దొరఁకొనినారు. టీకాసింగుకు కుడిచేయిగా నా యుద్ధమున సాయపడినది అజీజాన్ అను నొక వేశ్యవనిత. అనిన నానాఁటి ప్రజోత్సాహమును మీరలే యూహించుకొందురుగాక!

నానాకు నగరశాసనప్రబంధము నిర్మించుటలో తీరిక లేకపోయినది. సివిలియన్ పరిపాలన నగరమున నెలకొల్పినాఁడు.

హుల్యాలాసింగు ముఖ్యన్యాయాధికారి; మూల్లా సైన్యసమీక్షణాధికారి; జ్వాలాప్రసాద్ న్యాయాధికారి; అజీముల్లా, బాబాసాహేబులు కోర్టుమంత్రులు-ఇవి నానా కావించిన నగరప్రబంధమునందలి ముఖ్యాంశములు.

ఇరువదియైదు దినము లావిధముగా కోటముట్టడి సాగినది. కోటలోనివారికి మతి చెడినది. అంత వారందఱు హీ్వలరుచే తెల్లజెండా నెత్తించినారు. పదుగు రాడుమాట పాటియై ధరఁ జెల్లుఁ గాదె?

యుద్ధకాలములం దెల్లజెండా నెత్తుట సంధికి సూచకము. తెల్లనిజెండా చూచినపిమ్మట నింక నే సిపాయియుఁగూడ యుద్ధము చేయఁగూడదని రణనీతి. రాయబారము ప్రారంభమైనది. కాని యీప్రసంగములు హిందుస్థానీభాషలోనే నడుపఁబడవలయునని మొదటిషరతు. స్త్రీలనేమి చేయఁగలఁడు? అలవిగానివేళ నధికుల మనరాదనికదా నీతి. శరణన్నవారి నెల్ల అలహాబాదునకు సురక్షితముగాఁ జేర్చుటకు నానా యొడంబడినాఁడు. "బ్రతికియుండిన శుభములం బడయవచ్చు" నన్న నీతి యాంగ్లేయు లందఱు నెఱింగినదే కదా!



## ౧౬

## అపకారికి నుపకారము

ఝాన్సీసంస్థానము కంపెనీ పరిపాలనమునఁ గలిసికొని నది మొదలుగా నా సంస్థానమునఁ బ్రభుత్వము నెడ ద్వేష మధికముగాఁ జొచ్చినది. విప్లవకీల లచటకుఁ బ్రాఁకినవి. జూన్ 4 తేదీనాఁడు కోటలోని మందుగుండుసామాను స్వాధీనము గావించుకొనఁబడెను. ప్రజాసమూహము మా పిమ్మట లక్ష్మీబాయిని తిరిగి సంస్థానాధిపత్యము వహింపవలసినదిగాఁ గోరినది. వీరవనితయగు నామె తన ప్రజలమాటల నెట్లు కాదని త్రోసివేయఁగలదు? నాయకత్వము వహించుటకు నంగీకరించినది.

గ్రయోధ్య, సీతాపూరు, ఫైజాబాద్ మొదలగు చోటుల తిరుగుబాటు చెలరేగినది. ఆంగ్లేయు లందఱు నెక్కడివా రక్కడ నఱికివేయఁబడిరి. మౌల్వీఅహమ్మద్ షా అను తాలూకాదారు రాజద్రోహ నేరమునకై అంతకుఁ బూర్వమే ఖైదు చేయఁబడియుండెను. ఫైజాబాద్‌న స్వాతంత్ర్యము నెల కొనుటతో, సుబేదారు దిలీపసింగు, అచటి ఆంగ్లేయాఫీసరులనందఱు ఖైదుచేసి, అహమ్మద్ షాను బంధవిముక్తుని గావించినాఁడు. అచటిప్రజ లాతని నాయకునిగా నెన్నుకొనిరి. ఆతఁ డొక శాసనము గావించెను. ఖైదీలుగాఁ బట్టుకొనఁబడిన యాంగ్లేయుల నందఱను వారివారికిఁ గావలసిన సౌకర్యములను గలుగఁజేసి వారికి దారిబత్తెములఁగూడ నిచ్చి సమర్యాదగా సాగనంపవలసినది'' అని. ఇట్టిస్థితి నిజముగా ప్రాచ్యదేశమునకే తగినదిగదా !

జూన్ నెలలోసుల్తాన్‌పురము, సాంతోని సంస్థానములు స్వతంత్రతఁ బడసినవి. కాలాగా రైన హనుమత్సింగు తమాశ్రయించిన ఆంగ్లేయకుటుంబములకాశ్రయ మిచ్చి సురక్షిత స్థానములకుఁ జేర్చి మిగిలినవారిని పరలోకమున భద్రపఱచెను.

## ఢిల్లీ కోలాహలము

ఇపుడు ఢిల్లీలో స్వతంత్రత నెలకొనినది. బహదూర్ షా యేనుఁగు నెక్కి సైనికసమూహములకుఁ బ్రోత్సాహము నొసఁగుచుండెను. గఱిము, దేశము నాలుగుచెఱఁ

గులనుండి నగరములు స్వాతంత్ర్యత నొందినపిమ్మట ఢిల్లీనగర మెట్లున్నదో చూడవచ్చు. జనసంఖ్య పెచ్చుపెరిగినది. ప్రజా సముదాయము స్వాతంత్ర్యతకు సంతసించి పొంగిపోవుచున్నదంట. అనేక ఖజానాలనుండి ధారావాహికముగా ధనరాసులు ఢిల్లీ దిక్కునకుఁ బ్రవహించినవి. అచట స్వయముగా నాణెపు కార్ఖానాలో నేడువందల తూటాలు తయారు గావించుటకు బహాదూర్ షా యాజ్ఞ యైనది.

ప్లాసీ శతవార్షికోత్సవదినముననే, ఢిల్లీకోటపై జూండా మూఁడవ తేదీని పతాకోత్సవము సలుపుకొను భాగ్య మబ్బి నందులకు విప్లవకారులలోఁ గోలాహల మధికమైనది. నాఁడు మొదలుగా నొక్కొక్కనాఁ డొక్కొక్క నగరముగ, కాశీ, గోరక్ పూరు, ఆజీగడ్ మొదలగు చోటుల స్వతంత్రసేనల వశపఱచు కొనునట్లుగా ఢిల్లీకి వార్త లేతెంచుచున్నవి.

బహాదూర్ షా గౌరవార్థము ౧౦౧ ఫిరంగీపరంపర ప్రేల్చఁబడినది. ముప్పది వత్సరములనాఁడు పీష్వా సింహాసనమునకుఁ బట్టాభిషిక్తుడైన నానాసాహెబు. తత్సింహాసనమునఁ గూర్చుండుటకు భగవంతుఁడు ముహూర్తము నిశ్చయించినాఁడు. ఆతని గౌరవసూచకముగా నిరువదియొక్క మాఱు ఫిరంగులు ప్రేల్చఁబడినవి.

హిందూమహమ్మదీయసఖ్యత, గోవధానిషేధము మాతృదేశసంరక్షణ - ఈ మూఁడు ముఖ్యవిషయములనుగూర్చి

ప్రతియొకవ్యక్తి దీక్షపూనుట కైయభ్యర్థింపఁబడినాఁడు. శాస నముగాఁ బ్రకటింపఁబడుటచే హిందూముసల్మాన్ సంఘ ములు రెండును హర్షించినవి. ఇట్టి శాసన మెన్నఁడైనఁ దిరిగి భారతావని నెలకొనుదినములు రాకమానవు.

వందసంవత్సరములు యత్నించినను సంపాదింప వలను కాని; హిందూమహమ్మదీయులసఖ్యతను, రెండు మూఁడేండ్ల లోనే సంపాదింపఁగలుగుటకు ఆనాఁటి ఆ వీర పరాక్రమ వంతుల స్వార్థరహిత దేశభక్తియే కాని వేఱు కారణము లేదు. దేశవాసులలో సఖ్యత యున్నచో, ఏ దేశము పర దేశ దాస్యమునకుఁ బాల్పడ నవసరము రాదు. ఇయ్యది ముమ్మాటికి సత్యము.

మఱియు మతప్రాతిపదికపై నేరాజ్యము నేనాఁడును తిరముగా నిలువఁబడనేరదు. జాతిమతముల కతీతమై, సత్యాహింసలపై నిర్మింపఁబడిన రాజ్యమే శాశ్వతస్థాయిలో నిలువఁ బడఁగల దని యీ విప్లవము వేఱొకసారి ఋజువు గావించినది.

పాఠకులారా! భారతదేశము నీవిధముగా, దాస్య విముక్తము గావించిన మన భారతవీరుల కొక్కసారి జోహారు లొనరించి మీ తనువులు ధన్యత నొందించుకొనుఁడు. నూఱు వత్సరములుగా నీగాథ గడచి చనినను, స్వాతంత్ర్యవాంఛ మన నాడులలో ప్రవహించుచుండుటకుఁ గారణము భారత ప్రథమ స్వాతంత్ర్యపోరాటము సాగించిన యానాఁటి వీరుల సంకల్ప ప్రాబల్యమే కాని వేఱుకాదు.

---

౧౭

# ప్రచారము

## I

"విభజించి పాలించు" అనునది బ్రిటిషురాజనీతి. హైందవమతము నణఁగఁద్రొక్కుటయే వారల పరిపాలనకుఁ బ్రధానఫలము. అట్టి తమ దమననీతిని ప్రయోగించుటకు భారతమున నానాఁడు పరిస్థితులు మిక్కిలి యనుకూలములై యున్నవి. ఆశయములు పరస్పరవిరుద్ధములు గానున్నను, ఆచరణమున వైషమ్యదృష్టిగల రెండు విభిన్నమతములవారా నాఁడు ఆంగ్లేయులకు భారతమునఁ గానవచ్చినారు. వారే హిందువులు, మహమ్మదీయులు.

బ్రిటిషురాజ్యమహాభవన శంకుస్థాపనవేళ మొదటగాఁ జేర్పఁబడిన యిటుకలు రెండు. ఒకటి చీలఁదీయుట— రెండవది మోసముఁ జేయుట.

ఈదేశమున కేతెంచు నే యాంగ్లేయునకైన నుగ్గుఁబాలతో నీ రెండు సద్గుణములు నూరిపోయఁబడియుండు నన్నమాట. ఇఁక నా పాలకులు గుండెపైఁ జేయి వేసికొని యేనాఁడైన నిద్రింపఁగలరా?

దొంగతనముఁ గావించినవాని గుండె, ఫ్రాంటియర్ మెయిల్ రైలువేగమునఁ బరుగిడుచుండును. పాపపుణ్యము

తెలుంగని పసిపాపని హృదయము. పొంగి ప్రవహించు మహానదీగర్భమున ప్రవాహమువలె నుదాత్తమగు నడక గలిగి యుండెను. చీమ చిటుకు మన్నను దొంగకు, రాజభటులు తఱుముకొని వచ్చుచుండుటయే మనస్సున దోఁచును. నెత్తిపై బిడుగు పడినను, నిర్మలాత్ముఁడు త్రొణకఁడు.

## II

ఈనాఁడు మనకుఁగల ప్రయాణవసతి సౌకర్యములను గమనించుచున్న మా పాఠకులు నూఱువత్సరములనాఁడును భారతభూమి యిట్లే యుండు ననుకొనకుఁడు. పెద్దరహదారులు కొన్నిమాత్రమే గలదినము లవి. అంతటను కాలినడకయే. గజాశ్వములు శీఘ్రతర ప్రయాణముల కుపయోగపడు చుండునవి. ఒకవ్యక్తి ఒకవార్తను దూరమున నున్నవారికిఁ జేర్చుట యెన్నఁడును జరుగవలనుపడదు కదా! కాఁగా అంచెల నేర్పాటు చేసికొని వార్త నంపుచుండువారు. అంచె వార్తా వాహకులు సంఘ్మకమునకుఁ బుట్టినయిండ్లుగా నుండు వారు.

రహస్యతమము గు రాచకార్యములను, పక్షులచే పంపించుచుండుట పురాతనభారతాచారము. రాజకీయ పక్షమువారుగాని, తద్వ్యతిరేక పక్షీయులు గాని యీ పావంచె లనే ఆధారముగాఁ జేసికొని తమ తమ వ్యవహారములు నడుపుకొనుచుండువారు. ప్రభుత్వమున నధికారము, సభ్యతయైన కోశము నుండును గాని వ్యవహారమున కంతరాయము

రాకుండఁ గార్యములు నిర్వర్తించుకొనఁబడు చుండెడిది. విప్లవ ప్రచారకులకు ప్రభుత్వకోశములు కోటలు గదా!

దేశభక్తియొక్కటియే యాలోచనను కల్పించినది. పరిపాలనాసహిష్ణుత కోశమును సముపార్జించినది. ప్రజాశక్తి యత్యద్భుతమైన దని ఋజువైనది. ఎడ్లును బండియును నేకమైన కొండ నెక్కుటలో సందేహ ముండునా?

రహస్యగోపనము సాధించుట మహాత్తరవిషయము. హిందూమహమ్మదీయసఖ్యత బోధింప నవసరము లేకయే వారలలోఁ బాదుకొనినది. ప్రజలలోఁగల యుత్సాహశక్తి అంతఃప్రవాహము వహించి, కార్యావసరమునందే వెల్లడిఁ జేయఁగలిగినారు ఆనాఁటి ప్రజలు. విప్లవప్రచారమునఁ బాల్గొనినవారలు, వేతనముల కాశింపలేదు. రాఁగల ఉద్యోగముల నూహింపలేదు. పట్టిన పిశాచమును వదలించుకొనుటయే వారల యాశయము. భావిభారతపౌరులు, దాస్యభారము వహింపకుందురుగాక! యని వారల ఆశీర్వచనములు. వారు నడచిన త్రోవల నెచ్చోటఁ జూచినను, ఉపకారము చేతికందివచ్చినది.

నిర్ణీతమైన యొకానొక ముహూర్తము విప్లవము చెలరేఁగుటకు నిర్దేశింపఁబడినది. దానికే ప్రచారము గావించినారు. అందఱు తెల్లజాతి నంతమొందించుటకు బద్ధకంకణులైనారు. ఆక్షణమునకై యెల్లరు నెదురు చూచుచున్నారు. మఱియొకవిషయ మేమనఁగా, విప్లవానంతర కార్యముల కొకరూపము నిశ్చయించినారు.

ఎవ్వరు సింహాసనము నెక్కవలయునో, ఎవ్వరు మంత్రిపీఠ మధిష్ఠింపవలయునో. ఎవ్వరు సేనాపిపద మాక్రమింపవలయునో ముందే నిశ్చయింపఁబడినది. నైజాము రాజ్యమున రజాకార్ల ప్రచారముల నరికట్టుట కుపక్రమించిన భారతమంత్రాంగమును కన్నులారఁ గాంచిన మీకు భారత భూమిపై మంత్రశక్తి సంపదకు లోటు లేదని తెలియఁగలదు కదా!

## విప్లవము బ్రద్దలగుట

పాఠకులారా! సిమ్లాలో రాజప్రాసాదమున కొకసారి పోవుదము రండు. విప్లవము వర్ధిల్లుదినములు కాఁబట్టి మనము రహస్యసమయమున నే పోవలయును సుమా!

అర్ధరాత్రిసమయము. ప్రపంచమంతయు గాఢనిద్రలో మునిఁగియున్నది. విశాలభవనప్రాంగణమున రాజప్రతినిధి లార్డు కానింగు సుఖశయనము నొందుచున్నాఁడు. పహరా కాయు బంట్రోతులు జాగరితులై యున్నారు.

పండ్రెండుగంటలు హజారమున మ్రోఁగి యరగంట కూడ కాలేదు. పహరాజవాను కనురెప్పలు బరువు లెక్కినవి. ఒకసారి ఆవులించి, "పహరా హుషార్" అను నర్థమిచ్చు నింగ్లీషుభాషా నినాదము గావించి, తన యుద్యోగము చక్కఁగా నిర్వర్తించినవాఁడ నైతినని తృప్తితో గోడకుఁ జేరగిలఁబడినాఁడు. ఇంక ఒంటిగంట కొట్టఁబడినపు డొకసారి

భవనము చుట్టును తిరిగి పెంచ్చగిక గాలించి రాసి పెట్టుకున్నది. ఆ పిమ్మట వేటాకం డాం యనికారమునకు [illegible] కొనును. ఈలోపల పదినిముషములు కన్ను మూసినచో మిన్ను విఱిగి పడఁబోవదని నిశ్చయించుకొన్నాఁడు. అయినను మధ్య మధ్య రెప్పలెత్తి చూచుచునే యున్నాఁడు. అభ్యాసముచే నట్లు చేయుచున్నాఁడే కాని, రెప్పలుమూసియున్నపుడు నాతని చైతన్యమాతనిలో నిలిచినదో రెప్పలు విచ్చినపుడు నాతని సిలో నంతే చైతన్యము ప్రవహించుచున్నది.

ఒకసారి తన్నెవరో పిలుచుచున్నట్టుల [illegible] తెలిసియు తెలియని స్థితిలో నాతనికి తోఁచినది. కన్ను [illegible] వకదమో, 'ఫో, ఫో, ఇంకను ఒంటిగంట కొట్టఁబడలేదు. ఇంతముందుగా వచ్చితివేల? గున్నమునకు చేరగిలఁబడుము' అని సమాధానమిచ్చి సామాన్యసుషుప్తి పొలిమేరల [illegible] నాఁడు. అప్పుడాతనికి వినవచ్చిన పిలుపు ఆతని యూహా ప్రకారము ఆతనిపిమ్మట నాతని యుద్యోగధర్మము నిర్వహింపవలసినవానిదై యుండవలె. కంఠధ్వని వినఁబడిన మాట నిజమే కాని, అది పిలుపుగాదు; ఇరువురు సిపాయీల రోదనము. దీనతతోఁ గూడిన ముఖములు, బడలికలతో నలిగిన మేనులు, రుద్ధములై నూతినుండి వెడలుచున్నట్టులున్న కంఠస్వరములు, ఆయుధశూన్యములైన హస్తములు—ఇట్టి వారల మొఱ, నాయర్ధరాత్రమున నాచోట నిద్రఁబోవువాని కాళ్ళకు మ్రొక్కినటులున్నవి. ఇఁక నావచ్చినవారు పహారాజవానుప్రలాప

సంభాషణను చేసినారు. మేల్కొన్న వానికి నచ్చఁజెప్పఁగు జనానికి యెుద్దకు నర్ధరాత్రమైనను వార్త పంపింపఁగలరు కాని, నిద్ర పోవు వానికడ నేమి చేయవలయునో వారలకుఁ దోఁచినది కాదు. పోనీ, ఆపహారాజవానునే నిద్రనుండి మేల్కొలుప రాదా ? అని యందురేమో, అర్ధనిద్రనుండి మేల్కొనిన యతఁడు నిశీథమున నింత ధైర్యముగా రాజప్రతినిధిభవనము దరిదాపున కేతెంచిన వారలు శత్రువులై యుందురను నూహతో నతఁడు తన చేతనున్న తుపాకితోఁ వారలను గాల్చివేయుట తటస్థించినను తటస్థింపవచ్చును. తుపాకి కాల్పుల కంత భయపడిపోయినవారా వచ్చిన యిరువురు సిపాయీలు.

వారా సమయమునఁ దమ మొప్పటిరోదనమునే దీర్ఘీకరించుట తప్ప వేరొకమార్గము వారలకుఁ దోఁచినది కాదు. వారి రోదనధ్వనులు, హజారమున నిద్రించు కావలి వారలను కంటె రాజప్రతినిధినే ముందు మేల్కొలిపినవి. మేల్కొలుపుటే కాదు; చేతితోఁ బట్టి తెచ్చినట్టుల నా కానింగుప్రభువు నా చోటునకుఁ దెచ్చి వదలినవి. వారి కా సమయమున నీ క్రింది సంభాషణ ప్రవర్తిల్లినది.

‘‘ఎచటనుండి మీ రాక ? మీరాక యెచటనుండి ?’’ ద్విరావృత్తముగా నడుగఁబడిన, రాజప్రతినిధియొక్క యీ ప్రశ్నకు నూతనాగంతుకులైన యా యిరువురు సిపాయీలు

నొకే మాటుగా సమాధానము చెప్పినారు; కాని గోదనముతో మిళితమైన యీ సమాధానములం దిమిడిన యక్షరముల రాజప్రతినిధి పోల్చుకొనలేక పోయినాఁడు. ఘనమైన యాపద యేదో సంభవించియుండు ననిమాత్రము రాజప్రతినిధి కానింగు క్షణములో గ్రహింపఁగలిగినాఁడు. అపాయ సూచకముగా తన తూ తూ నూఁదినాఁడు మునుహాగ్గలులు. క్షణములో నాచోటు పటాలము మొలక లెత్తినట్లున్నది. ఇరువురు సిపాయీలఁ దన రెండు చేతులతోఁ బట్టుకొని లోనికిఁ గొనిపోయినాఁడు రాజప్రతినిధి.

అందఱితోఁ బాటు పహారా జవానుగూడ నిద్ర మేల్కొనినాఁడు. తన ప్రమత్తతకు లోలోన భయపడుచు చుట్టుఁ జేరిన సైనికులు కట్టుదిట్టము చేయ మొదలిడినాఁడు. పహారావాని కన్న సంగతులు తెలిసియుండునని యూహించుకొనిన కొందఱు సిపాయీలు. వానిని సమీపించి, ఆపద తెలుపు బిగులు పిలుపునకుఁ గారణ మేమైయుండు నని ప్రశ్నింపఁగడంగినారు. బిగుల్ ఊఁదిన దెవ్వరో యెఱుంగని యా కావలి జవాను రాజప్రతినిధి భవనము దొంగలచే దోఁచుకొనఁబడిన దని యొకరికి, భవనములో నెవ్వరికో తేలుకుట్టియుండు నని యొక్కరికి, త్రాఁచుపాము కానవచ్చి తప్పించుకొని పోయినదని వేఱొక్కరికి, వేసవిగావున నెచటనో కొన్ని శిబిరములు పరశురామ ప్రీతియైనవని సమాధానముల సందిగ్ధ పొందిక లేనట్లు చెప్పుట కారంభించినాఁడు.

లోపలివృత్తాంత మేమో నెవ్వరు నెఱుంగరు. రోదన ధ్వనుల సిపాయీలు కొందఱు వినియుండుటచే గావలిమాటలను వారు నట్లే సమన్వయము గావించుకొన్నారు.

కానింగుప్రభువు స్వయముగా నిరువురు సిపాయీలను భవనములోనికిఁ గొనిపోవుట తమకండ్లతోఁ జూచినవారలు మాత్రము గొప్పముప్పు ఉప్పతిల్లినదని యూహించుకొనఁ గలిగినారు. కాని, యీ ప్రస్వభావము వార లెట్లు నిర్ధారణము చేయఁగలుగుదురు ?

---

౧౮

## కానింగు కండ్లు తెఱచుట

కానింగు ప్రభుభవనము వెలుపల సంరంభమును జూచితిరికదా! ఆసిపాయీలు నిరంతరరోదనమున నా చోటునకు రాఁగారణ మేమో తెలిసికొన మీరును సంజాతకుతూహలులై యున్నారనుకొందుము. పాఠకులారా! అట్టులైన ప్రభుభవనాంతర్భాగమునకుఁ బోవుదము నాతో రండు. రక్షకభటు లడ్డువెట్టుదు రని యనుమానించుచున్నారా? ఇటు వినుఁడు హజారము కావలిగాయుచున్న భటునకిపు డొక సంకటస్థితి తటస్థించినది. ఏమందురా? తాను కావలియున్న ద్వారముకడకు నర్ధరాత్రమున నూతనులగు సిపాయీలేతెంచుట తటస్థించినది. ప్రభువున కాసంగతి మొదట వినిపింప

వలసినవాఁడు తాను. ఆవచ్చినవారు శత్రువులో మిత్రులో దెలిసికొనవలసిన బాధ్యత తనది. తన నియోగమును తాను సరిగా నిర్వర్తించినవాఁడు కాలేదు. దాని [illegible]. ప్రభువు స్వయముగా వచ్చి ఆయాగంతుకుల [illegible] పోవుట జరిగినది. క్రొత్తవారలను సముచితసలహాలతో నావలకుఁ బంపించిన పిమ్మటనైనను దానాసమయమునఁ బ్రభుత్వుఁడై యున్న విషయము విచారణకు రాకమానదు. అప్పుడాతఁడు తన యలస ప్రవర్తనకు క్షమాపణ వేఁడుకొనుట తప్ప వేఱుమార్గము లేదు. క్షమాపణ వేఁడినను, శిక్ష తప్పని పోవచ్చు. ఒకవేళ శిక్ష తప్పినను, ప్రమోషను లేకుండ ఆఁపివేయఁబడవచ్చు. లేదా యతనిని క్రిందిగుద్యోగమునకు మార్చవచ్చు. చూచితిరా! ఉన్నతిని ప్రభువున్నను [illegible] రాజుకొలువున నున్న వానికి, నొకక్షణము ప్రమత్తతను వహించినకారణమున నెంతటియనర్థ మాపాదింపఁబడనున్నదో! ఇట్టిసంకటనమునఁ బడి కొట్టుకొనుచున్న యాసిక్కు భటుఁడు మనల నడ్డుపెట్టు స్థితిలో లేఁడు. కాన యథేచ్ఛగా మనము ప్రవేశింపవచ్చు. రండు.

అదిగో కానింగు కడునాగ్రహముతోఁ బ్రశ్నించుచున్నాఁడు. సద్దు చేయక వారల సమాధానమును వినుఁడు. ఇంగ్లీషుదేశపు టుచ్చారణతో నింగ్లీషుభాషలో జరుగుచున్న యాసంభాషణలో, మీరట్ పదము పదేపదే స్పష్టముగా వినవచ్చుచున్నది. ఆపదము వినవచ్చినప్పుడెల్ల కానింగు ప్రభువు

ముఖము తేజోహీనమై మరలఁ బ్రశ్నించునప్పు డాతని కంఠము వెలుఁగు రాచుకొని పోవుచున్నది. ఆ వచ్చిన వారలను ఆచోటునకు సమీపమున విశ్రమింపఁ బొండని చేతి సంజ్ఞతో నాజ్ఞాపించినాఁడు. కానింగు శరీరము శయ్యపైఁ గూలఁబడినది. తల తిరిగిపోవుచున్నది. మనస్సు మధ్యధరా సముద్రము దాఁటి పోవుచున్నది. కంపెనీవారి యెదుట తా నొక నేరస్థుఁడనని యాతనికిఁ దోఁచుచున్నది. సమాధా నము చెప్పికొన నవకాశ మేమియు నాతనికిఁ గానరాలేదు. తన పర్యవేక్షకత్వమున నున్న యాంగ్లసేనలు నఱికివేయఁ బడినవి. ఆంగ్లావాసములు దగ్ధము గావింపఁబడినవి. మీరట్ నుండి ఆ సిపాయీలు తెచ్చిన వార్తాసారాంశ మియ్యది.

"స్వదేశీయ పటాలములు తిరుగుబాటు-కాదు విప్ల వమునకు సంసిద్ధ మగుచో నింక భారతభూమిపై నాంగ్లేయు లకు నిలువ నీడ యెక్కడిది? ఇంక నితర పట్టణములలో నెన్నిచోట్ల నిట్లు విప్లవము చెలరేగినదో!! ఎందఱాంగ్లేయ సోదరులు చిత్రవధలకు పాలు గావింపఁబడినారో!!

ఫ్రెంచి, మహాశాకినీ వదనమునుండి భారత ప్రభుత్వ మును వదలించుటకుఁ దమస్వాధీనము గావించుకొనుటకుఁ బూర్వపురుషు లెందఱెన్ని యవస్థలు పడినారోకదా! ఈ నాఁటికి నాయాజమాన్యమున నీ విధముగా దుర్గతిపాలైన కంపెనీ ప్రభుత్వము నింద నంతటిని నాపైననే మోపును

గదా! క్షణ మాలసించిన నెట్టి దుర్వార్త వినవలసివచ్చునో కదా?" అప్పటి యాతని యూహ లిట్టివి.

"విప్లవమహాగ్ని పర్వతము నే నధివసించిన యీపర్యంకము క్రిందినుండి బ్రద్దలయి, పైకివచ్చి, నన్నును నా యనుచరులను 'లావా' ప్రవాహమున ముంచివేయదుకదా? మైసూరుత్రోవలో విప్లవకరపత్రములతో నుసరుకొక వర్గము పట్టుకొన్న గూఢచారికథ తెలియవచ్చిననాఁడే దేశీయసైన్యమును నిరాయుధము చేయవలసినదిగా నాజ్ఞాపించియున్నారు. కాని యేమిలాభము? ఏది జరుగరాదో, ఏది యాంగ్లజాతి వినాశసూచకమో యయ్యది జరుగనే జరిగినది. బ్రతుకు మీఁద నాశ లేనేలేదు. కాని యుద్యోగనిర్వహణ బాధ్యత మనపై నున్నదిగదా! దానిని నిర్వర్తించు టెట్లు? ఏమి గావించుటకును గాలుసేతు లాడుట లేదు."

ఆంగ్లజాతి రాణింపఁగలదు కదా కష్టముల నెదుర్కొనుటలో. కీర్తి, అపకీర్తి అనువిచారముతోఁ బని లేకుండ రాజ్యప్రతిష్ఠకై పెనఁగులాడునది యాంగ్లజాతి. సమయస్ఫూర్తి ప్రదర్శించుటలో నాంగ్లజాతి కాజాతియే సాటి. కాకున్నచో, అనేకసముద్రముల కావల పదువేల మైళ్ళదూరమునఁ గల పాలమునఁ గాలిడి, మొదట సాహుకారులై—పిమ్మట కొలువుదారై—ఆ పిమ్మట భూకాంతుండై—నేఁటిదకు సార్వాధిపత్యము వహించు నేర్పు ఆంగ్లజాతి ప్రదర్శింపఁగలదా!!! ఇట్టి గుణవిశిష్టత

గల జాతివాఁడయ్యును, కాళింగుప్రభువు తనపడకపై నధోముఖుండై పడియుండి యరగంటసేపు సుఖించినాఁడు.

అంతలో నతఁడొక యాలోచన గావించినాఁడు. "యశోవా మృత్యుర్వా" యనునటులు పరాక్రమించి, పౌరుషము నిలువఁబెట్టుకొనవలయు ననునదే యాతని యప్పటి యాలోచన; కాని శత్రువు ఎదుటనున్నపుడు గదా యాతని యాలోచన ఫలించునది! సర్వము నాశనమైనదని కదా యీ వార్త హరులేతెంచి వినిపించిన వార్త! ఏదారిని మీరట్‌నకు వార్తా చేరఁగలదు? మరల నాసిపాయీలఁ దనయొద్దకుఁ బిలిపించి నాఁడు. ప్రశ్నపరంపరఁ బ్రయోగించి, కొన్ని క్రొత్త విషయములఁ దెలిసికొనినాఁడు. తన రాజ్యాంగమంత్రము నంతయు నుపయోగించి యొక స్థిరనిశ్చయమునకు వచ్చినాఁ డా రాజప్రతినిధి.

ఇంగ్లాండునుండి భారతదేశమునకుఁ బంపఁబడు సిపాయిలే మిక్కిలి యుద్ధండులు. అధికారపదవుల నాక్రమింప నేతెంచు వారు మిక్కిలి రాజనీతిచతురులు. రాజప్రతినిధిగా నధికారము వహించువాఁ డపరయౌగంధరాయణుఁడై యుండునని మేము నిశ్చయించి చెప్పఁబోవుట లేదు. ఏవిషయమునందైనను, మతిఁ బ్రవేశింపఁజేసి ఆలోచించవలయునే కాని మానవునకుఁ దోఁచని యాలోచన లుండనేరవు. "అరిది విలుకాని యుజ్జ్వల శర మొక్కటి తప్పి చనిన–" అని భారతమునఁ జెప్పఁబడలేదా!!!

ఇట్లాలోచించినాఁడు కానింగుప్రభువు-హిందూమహమ్మదీయు లెంతకాల మీదేశమున మనఁగలుగుదురో అంతకాల మీచోట మూఁడవజాతి యీదేశమును పరిపాలించవలసినదే. ఆవిషయ మెప్పుడో నిర్ధారణ మైనది. వారిలో వారికిఁ బరస్పరసహకార మేనాఁ డేర్పడునో ఆనాఁడు పరదేశవాసుల కీచోట నిలువఁ జోటుగాని, త్రాగ నీరముగాని లభించవు. వారల పరస్పరసహకారముమూలమున నేర్పడినదే అయియుండవలె ప్రకృతవిప్లవము. దీనికి విఱుగుడుగా వేఱొక తంత్రము పన్నవలసి యున్నది. అది యిది—

హిందువులలో శిక్కులను వేఱొకజాతి మిక్కిలి పౌరుషవంతమైనది కలదు. మహమ్మదీయు లనిన మండిపడు స్వభావముగల దా శిక్కుజాతి. కావున శిక్కుపటాలములకై వార్త నంపెదఁగాక. మఱియు ఢిల్లీకోట కనతిదూరమున నున్న ఒకటిరెండు సంస్థానముల చేయూఁత లభించుచో, ఏగండముగడచి బయటఁబడవచ్చును-అసలు సుంత్ర మూలని ఈ విధముగా మనస్సునకుఁ దోఁచినది.

శీఘ్రగాముల వార్తాహరుల రావించినాఁడు, కర్తవ్యమును బోధించు లేఖలను తానే స్వయముగా రచించినాఁడు. లక్నోనగరమునఁ గల సేనాసన్నివేశమునకు, కాన్పూరు సేనానాయకునకు ముందుగా వార్తల నంపినాఁడు.

కంపెనీవారి కీ వివరము లన్నియుఁ దెలుపు లేఖ వ్రాయుచు, ఇప్పటి కీ వ్యవహారము చేయి దాఁటినట్లే

యనియు, వ్యవధి లభించి, సమయమునకు సాహాయ్య మందు కొనఁగలిగి నట్లయితే మాత్రము జయము కంపెనీసేనలనె నగింపఁగలదని స్పష్టపఱచినారు.

---

## ౧౯

## యుక్తి

అది మునిమాపువేళ. బయటికి వచ్చుచున్నాఁడు హ్వాలరు కట్టించిన కోటనుండి యొకవ్యక్తి. నానా సేన లతి జాగరూకతతోఁ గాన్పూరుకోటఁ గాచుచున్నవిగదా! అతఁ డెట్లు పట్టువడకుండును? అతఁడు కౌపీనమాత్రధారి, చేత నొక కఱ్ఱ గోరువంకమాత్రమే కలవు. ఇఁక నెట్టి వస్తుసామగ్రియు నతనియొద్దఁ గానరాదు. అపు డపుడా గోరువంక శబ్దము గావించుచున్నది. ఇట్టి దిగంబరునకు, నే రాజకీయ సంబంధము నుండదనినాఁ డొకఁడు. అట్లు కాదు, గూఢచారు లిట్లే యుందురనినాఁ డింకొక్కఁడు. అట్లయిన మన మతనిని మన యధిపతి కడకుఁ గొంపోవలసినదే యనినాఁ డింకొకఁడు. అట్లే యతఁ డొకచిన్నయధికారియొద్దకుఁ గొనిరాఁబడినాఁడు.

"ఎవ్వరు నీవు?"

"లోపలివారు తన్ని తగిలేశారు బాబూ?"

"ఓహో! బధిరత్వము గూడనా? ఎక్కడికి పోవుచున్నావు?"

''మైనా బాబూ! యిది. దీని జతను వెదకి పట్టు కొనుటకై పోవుచున్నాను. నిన్న సంగా నం తప్పిపోయిన దండీ బాబులారా!''

''నాలుగు తన్నండిరా వీనిని.''

''అయితే యీ మైనా మీరే తీసికొనండి బాబయ్య లారా'' ఒకఁడా పిట్టను గ్రహించినాఁడు. నూతనవ్యక్తి విడువఁబడినాఁడు. జోక్క లంద్చుచు తిరిగి నొక సారి యని కూసినది.

అటఁ జేరిన సహరాహారి కా వ్యక్తిపై ననుమాన మేమియుఁ గలుగలేదు. తల వంచుకొని వెడలిపోవుచున్న యతనిని, వెనుకకుఁ బిలిచి, దయదలఁచి మైనా నిచ్చి పంపి నారు.

కొన్ని యడుగులు నడిచి నొక చోట నా బడుగు మానిసి యొకింత విశ్రమింప నూహఁ గొనినాఁడు ఒక వృక్ష మూలమున నొరఁగినాఁడు. సన్నని పీలిక మైనా కాలికిఁ గట్టి చేత పట్టుకొనినాఁడు. ఆ పక్షియుఁ గొంతదూరమునఁగల గింజల నేఱికొని తిన ముందునకు నడచినది. రెండు మూఁ డడుగులు స్వేచ్ఛగా సాగినవి. ఆ పిమ్మటఁగాని కాలి బంధము సంగతి తెలియరాలేదు. నిర్బంధము తెలియఁగానే ఱక్క లల్లార్చి యొక్కమా ఱెగిరి యాచోటుననే నేలమీఁదఁ బడినది.

నేల బారుగాఁ బరుండియున్న బడుగు మనుజుఁడు దాని ఱెక్కలక్రిందఁ గట్టఁబడిన లేఖఁ గాంచినాఁడు. తనలో నిట్లను

కొనినాఁడు. 'పిచ్చివాఁడు హీర్యాలసు. బ్రతికి బయటపడుదు ననియే యూతసియున్నాఁడు! ఈసారి కాతనిపని పరిపూర్తి అయేయుంటుంది. ఇంక నీలేఖ దేనికి ? కాని, వాతప్పు రాకుండదు. గంతవ్యమునకు దీనిం జేర్చెదఁగాక! హజారమున నున్న ఆ రక్షకభటులకు నాపైఁ గలిగిన యనుమానము పూర్తిగాఁ దీరునటులు నీవృక్షచ్ఛాయలోఁ బసియుండెదఁగాక !

ఈ పక్షిపిల్లకు లక్నో నగరము తెలిసియున్నట్లయిన దీసి నెగురవైచినఁ జాలును. లేఖను గమ్యస్థానమున కదియే చేర్చియుండునది.

లేఖలోని విషయము లతిముఖ్యములు--అతిశీఘ్రముగాఁ జేర్పఁబడవలసినవి–అనుమాట తథ్యము. కాని దేశమందంతట గూఢచారులు ప్రబలియున్న యీసమయమున నేను పట్టుపడకుండఁ గమ్యస్థానముఁ జేరు టెట్లు ? కోటనుండి బయట పడుటకీ బడుగువేస ముపకరించినది ఇఁకమీఁదట హీర్యాలరు రహస్యముగా నిచ్చిన బంగారునాణెము నాపుక్కిట నున్నది కదా ! దాని నెచ్చోటనైన మార్చి, వేసము మార్చి పయనము సాగించెదఁగాక.''

ఇట్లు కొంతవడి కాలోచించి, యాతండు మరల నాలోచింప మొదలిడినాఁడు.

''ఒక వేళ నాణెము మార్చుటలో పట్టుపడవచ్చును. అన్నివిధముల నీప్రకృత వేషమే తగియున్నది. మీఁదుమిక్కిలి

నాయీయాశ్రమకు దొర నే తిరిగివచ్చునప్పటికి బ్రతికియుండినం గాదా బహుమానము లభించునది ? అది ఉత్త కల్ల. కావున నే నిక్లే పయనము సాగించెదంగాక !"

---

## ౨౮

## స మీ క్ష

భారతదేశమునం గంపెనీప్రభుత్వము కూలిపోయినది. పరదాస్యపీడ పటాపంచలైనది. భారతభూమిపై స్వాతంత్రత తిరిగి నెలకొనినది. దేశభక్తులు గావించిన త్యాగములు అల్ప కాలముననే ఫలించినవి. పీష్వా బాజీరావు తనయొక్క సంయమము, కృషి, ఓర్పు, వృథగానందుల కలండు మిక్కిలి సంతసించినాండు. నానా ప్రభృతులు తమజీవితములు ధన్యత నొందినవని సంతసించినారు. దేశవాసులలో నైక్యత యున్నచో, ఎంతటిరాజకీయపుటిక్కట్లనైన సులువుగా దాంటి పోవచ్చునని ఆనాండు ప్రాప్తించిన స్వాతంత్రత సాక్ష్యమిచ్చి నది. ఇంతయేల ? అన్యాయము చేయుటకునుఒకకొంత పరిమితి గలదనియు, ఆపరిమితి నతిక్రమించుటయే నాంటి తమ యోటమికిం గారణమని కంపెనీయధికారులునయితము తెలిసి కొన్నారు. అనాం డెవ్వనినోట విన్నను ఇట్టివియే పలుకులు.

విద్యార్థులారా ! స్వతంత్రభారతమును మాచుచున్న మీ జీవితములు ధన్యతమములు. స్వాతంత్ర్య ఫలమును సంపూర్ణముగా మీ రనుభవింపఁగలరు.

కాంగ్రెసు అఱువదిసంవత్సరములుగా స్వాతంత్ర్య పోరాటము నేల మరల సాగింపవలసివచ్చినది ? అను ప్రశ్న మీ మానసముల కలఁత పెట్టుచుండునని నే నెఱుంగుదును. కాని ఇంతవఱకును నీ చిన్నిపుస్తకమున ప్రథమ స్వాతంత్ర్య పోరాటమునకు దారితీసిన కొన్ని ముఖ్యసంఘటనలను మాత్రమే పేర్కొనుట నా యాశయము; కాని, విప్లవము యొక్క సక్రమాభివృద్ధి నర్థించి చెప్పుట నా కభిమతము గాదు. ఏలన ఆనాఁటి రాజకీయములు, అప్పటి దేశకాలపరిస్థితులు, ప్రజలయందుఁ గల రాజకీయచైతన్యము, రాకపోకలకుఁ గల వసతులు, విదేశముల రాజకీయములకు మన దేశమున పరిస్థితులపైఁ గల ప్రభావములు. స్వదేశసంస్థానముల వారి ప్రవర్తనాదికము–ఇన్నిసంగతులు యథాతథముగా బోధపడుచుకొన్ననాఁడు విప్లవ తత్వము బోధపడఁగలదు.

నాఁడు భారత దేశమునఁ జెలరేఁగుచున్న విప్లవము వార్త కంపెనీ ప్రభుత్వమునకుఁ దెలియదా ? తెలిసినచో దాని నణఁచుటకు వారలు గావించిన ప్రయత్నము లెట్టివి ? స్వతంత్రపతాకము ఢిల్లీకోటపై నెగురుచుండుటను గన్నులారఁ గాంచిన పరదేశపరిపాలకుల మనోభావము లెట్టివి ? చేయిజాఱిన నాఁటి పరిస్థితులను తిరిగి వార లెన్నాళ్ళకుఁ దమ స్వాధీనము లోనికిఁ దెచ్చుకొనఁగలిగినారు ? అతిక్లిష్ట

సంకట సమయముల వారు ప్రవర్తించిన విధానము ఎట్టిది? పరిస్థితుల నడుమ పులోనికిఁ దెచ్చుకొనుటకు సాహసించిన దైవమే వారలకుఁ దోడైనాఁడా? "దైవమ్ మానుషరూపేణ" అనఁగ దైవము మనుష్యరూపమున వచ్చి సాయము చేయు నని కదా పెద్దలు చెప్పుదురు? స్వదేశములకుఁ బ్రతికూలుఁ డును, పరదేశీయులకు ననుకూలుఁడు నగు నా దైవము నాఁ డెవ్వరి యంతరాత్మల నావహించుటచే దిరిగి భారతదేశము తొంబదియేఁడులు దాస్యభారమునఁ గ్రుంగిపోవలసివచ్చినది? ఈ సందేహముల నపనోదనము గావించుటకే ముందుప్రకరణ ముల కథ ప్రారంభింపఁ బడుచున్నది.

— —

## ౨౧

## ప్రతీకారము

రాజప్రతినిధి యాజ్ఞల నందుకొని దేశభక్తుల ప్రసరకిన వారిలో ముఖ్యుఁడు నీలు. అలహాబాదు, బనారసు నగరముల కరుగునదిగా నాతఁ డాజ్ఞప్తుఁడైనాఁడు.

నీలు స్వభావముచే గట్టిగుండె గలవాఁడు. [illegible] నుఁడు. రాజకీయముల నతఁ డొకసారిగా నవగాహనము గావించుకొని, నొక పద్ధతి కార్యాచరణమును నడుపుటనే నిశ్చయించుకొనును. అది న్యాయమైన నన్యాయమైనను సతఁ డా పద్ధతి వీడఁడు. ఇతరులమాటలు లెక్కసేయఁడు.

అని కిషనుసింగు నిష్టురుండై దా సానుగూర్చి సమలసింగున్న బ్రా తఁడు మొదటనే గ్రహించినాఁడు. అతఁడు కాశీ చేరినాఁడు. తనక్రింది సైన్యమును నాలుగుభాగములుగా విభజించినాఁడు. వారల కొక్కొక్కటే యాజ్ఞ-సర్వనాశనకర్మ-అయ్యది.

నీలు సైనికులు నడచిన దిశలఁగల గ్రామములలో చిన్న-పెద్ద, ఆడ-మగ, ముసలి-ముతక, కుంటి-గ్రుడ్డి, ధని-పేద, అంతర్వత్నులు-స్తనంధయులు అను భేదము పాటింపఁబడకుండ గ్రామవాసులు చిత్రవధలపాలు గావింపఁబడినారు.

చింతచెట్లకుఁ గాయలవలె మనుజులు రథ్యావృక్షములకు గ్రామచైత్యములకు వ్రేలాడఁదీయఁబడినారు. గ్రామములు పరశురామప్రీతి గావింపఁబడినవి.

ఇంగ్లీషువాళ్లు దేశీయులైన సివిల్ ఉద్యోగులనుగూడ నీసందర్భమున వదలలేదు. ఈవిధముగా నాలుగు దెసల కొసల వఱకు నీమారణహోమము సాగిపోవుచునే యున్నది. దేశభక్తిప్రమాణములఁ గావించినవారు మొదటనే ప్రాణముల దేశమునకై బలిగావించుటకు సిద్ధపడి యున్నారు. ఈ యిక్కట్లన్నియు సామాన్యప్రజల వంతునకు వచ్చినవి. కాదనువాఁడుగాని, నివారించువాఁడు గాని లేఁడు.

అలహాబాదు చౌకునం దేడు వేపచెట్లకు నెనిమిది వందల నగరవాసు లురితీసి వ్రేలఁదీయఁబడి యుండి రనిన నింక నానాఁటి మహాప్రళయమును మనస్సులో నూహించుకొనవలసినదే కాని వ్రాయ నలవి గాదు.

నీలు సేనానికి, కాన్పూరునందున్న [illegible] సైన్యములవలనఁ దెలియవచ్చినది. వెంటనే నీలు [illegible] సైన్యము నిచ్చి కాన్పూరునకుఁ బంపినాఁడు. పంజాబునుండి క్రొత్త సిక్కు సేనానివహ మొక్కటి వచ్చి వానిఁ జేరినది.

# I

## బ లి య సీ కే వ ల మీ శ్వ రా జ్ఞా

విప్లవారంభమునకై నిర్దేశింపఁబడి, ప్రచారము గావింపఁబడిన దినము వేఱు. నిజముగా తిరుగుబాటు ప్రారంభమైన దినము వేఱు. ఈ దుస్సంఘటనకుఁ గొన్ని ప్రాంతములలోని [illegible] మానవులేఁ గాని వేఱు కాదు.

పంజాబునందుఁ బ్రభుత్వము తమ రాజనీతి నుపయోగించి ప్రవర్తించినను అమృతసర్, సితారా, జలంధర్ మొదలగు కేంద్రములలో విప్లవప్రచారము చురుకుగా సాగినది. నిర్ణీత దివసమునకై హిందూపటాలములవా రందఱు నెదురు చూచుచున్నారు. ఆహా! నానాప్రభృతులు లేవఁజేసిన సుముహూర్తమున నే విప్లవాగ్ని దేశమునం దంతట నొక్కసారిగాఁ జెలరేఁగియున్నచో ఇఁక ముందు ప్రకరణముల కథ వ్రాయునట్టి దుర్గతి మా లేఖినికిఁ బట్టియుండునది కాదు.

పంజాబునందు మియాంమీరు ముఖ్యముగా నొక సైనిక కేంద్రము. తదధికారియగు మాంటుగ్ మారికి మీరటు స్వతంత్రత నొందెనన్న వార్త తెలియవచ్చినది. ఇంతటి కట్టుకాటు

ఇంతలో స్వార్థపరులగు కొందరు నాయకులు తమ ప్రభుత్వమునకు ముందుగాఁ దెలియవచ్చిన దని ఈ రాజ్యస్థాపకులరు గాకుండుదు ప్రజలలో నగ్గికిఁ గాకున్నఁ గొందఱికైనఁ దైన స్వార్థప్రేరితులు గాకుందురే?

కవాతు మైదానము నకుఁ జేరవలసినదిగా హిందూ సైనికులందఱకు ముందుగ నాజ్ఞ యిచ్చినట్లు మునుపే చేరినది.

కేలనుండి హిందూసైనికులు మైదానమునఁ జేరినారు. వారికి యెట్టయెదుట నాంగ్లసైనికులు నిలువఁజేయఁబడిరి. ఇయ్యది దివఱ కెన్నఁడు లేని యాచరణము. "ఇది యేమో" యని యెవ్వనికివాఁడు మనస్సులోనే ప్రశ్న గావించుకొనినాఁడు. సేనాని యాజ్ఞకుఁ, గావించిన యెదురుప్రశ్నకుఁ దుపాకియే సమాధానమిచ్చును గదా! సేనాని యొక యున్నతస్థానమున నిలిచి, "ఆయుధముల నేలఁ బెట్టుఁ" డని యాజ్ఞాపించినాఁడు. క్షణములో సైనికులు నిరాయుధులై నిలిచినారు. మీ మీ స్థానములకుఁ జేరుఁడని రెండవయాజ్ఞ. మైదానము మధ్య భాగము శూన్యమై కనుపట్టినది. వెనుదిరిగి చూచినవాఁ డడుగులోనే కాల్చి వేయఁబడినాఁ డని వేఱుగాఁ జెప్పనక్కఱ లేదు కదా!

పెషావరు, లాహోరులందును హిందూసైనిక తీవ్ర క్రియ ననుసరించియే నిరాయుధులు గావింపఁబడినారు. హోతీ మర్దానుకోటలో సేనాను లనుమానించిన హిందూసిపాయీల నందఱను ఫిరంగులమూతులకుఁ గట్టి కాల్చివేసినారు.

# II

## చలో ఢిల్లీ

జలంధర్, ఫిల్లౌరా సైనిక కేంద్రములవారు, స్వాతంత్ర్యమొంది జయజయధ్వానములతో ఢిల్లీకి బయలుదేఱినారు. సట్లెజ్ నది వారి కడ్డముగా నిలిచినది. నది కావలి యొడ్డున లూధియానానగరము గలదు. అచటి యాంగ్ల సేనాని సేనా నివహముల రాక ముందుగా నెఱింగి, నదికిఁగల వంతెన విరుగఁ గొట్టించివైచిరి. చారచక్షువు గదా ప్రభుత్వము!

నాలుగుమైళ్ళు నదికి నెగువ నపరిచితమైన యొకరేవు. అర్ధరాత్రము. పొంగిప్రవహించు సింధునదీశాఖయగు సట్లెజ్ ఆ సేనల నదినుత్తరింపఁజేసినది. దేశభక్త్యావేశము గాని సేతుసాధనములు గావు. ఈవలియొడ్డున ఆంగ్ల సిక్కు సైనికులు తుపాకులు వారలకు స్వాగతము పలికినవి. కొందఱు సైనికుల నదిని దాఁటిరి కాని, సహాయసంపదలు, సాధనములు నింకను నావలియొడ్డున నున్నవి. మఱి రెండుజాములకుఁ గాని కర్మసాక్షి కానరాఁడు. వారిచే నట నావేళ పోరించినది. స్వాతంత్ర్యము నొందితిమన్న యుత్సాహావేశము కాని బలసంపద కాదు. సూర్యోదయమునకుఁ బూర్వమే, యాంగ్లసైనికుల యధినేత విలియమ్సును నేల కొఱగించినారు. సిక్కుసేన లొక్కయడుగు వెనుక వేసినవి. వెనుకనున్నవారు నది నుత్తరించి వచ్చి కలిసికొనినారు. పగలు రెండుజాములకు లూధియానా

పట్టును విప్లవము చెలరేఁగకుండ సంరక్షించి పెట్టినాడు. ఐసన దారిలో మహామారివాతఁ బడినాఁడు. సర్ హెన్రీబర్నార్డ్ ఐసన్ స్థానము నాక్రమించినాఁడు. హెన్రీని కలిసికొనుటకై మీరటునుండి యాంగ్లసైనిక పటాల మొకటి బయలుదేఱినది హిండన్ యొద్ద దేశభక్తులసేన వారి నెదుర్కొనినది. పటాలము ముందఱ సేన నిలుచునట్లు లేదు. నానా సేనలు, కన్ను మూసి తెఱచునంతలో నదృశ్యము లైనవి. పటాలము లు ఫిరంగులు లభించుచున్నవను సంతోషముతో నిర్భయముగా సమీపించినవి. అచటనున్న ఐదుఫిరంగులు నంత నొక్క మాటుగా ప్రేలినవి. తెల్లసేన మూఁడుపాళ్లు బూడిద యైనది. ఆ ట్లొంటరిగా నిలిచి ఫిరంగులఁ బ్రేలఁజేసి వానితోఁ బాటుగా భస్మీభూతుఁడైన యా యజ్ఞాత దేశభక్తుఁ డెవఁడో కదా! భారతదేశ స్వాతంత్ర్యవార్త యాతని యాత్మకు శాంతిఁ గలుగఁ జేయుఁగాక!

మేజర్ రీడు కొంత సైన్యముతో మీరట్ పటాలములఁ జేరినాఁడు. నాభామహారాజు చలువచే సైనికులకు భోజన వసతి చక్కఁగా జరిగిపోవుచున్నది. అలీపూరునుండి యెంతో దూరము పయనింపలే దా సేనలు. బహదూర్ షా సేన వార లతో దలపడినది. బహదూర్ షాకుమారుఁడు మీర్జామొగల్ దాని కధినేత. లేఁతవయస్సువాఁడు యుద్ధములలో నారితేరిన వాఁడు గాఁడు. ఎదుట మెరియలవంటి ఘూర్ఖా- సిక్కు- సైనికులు.

విప్లవముఖ్యోద్దేశముల నిటఁ గొంత చర్చించుట అనవసరము కాదనుకొందును. నిర్ణీతదివసమున విప్లవము ప్రబద్ధలగుట- ఆక్షణములో నాంగ్లేయు లందఱు నఱికివేయఁబడుట జరుగవలె. ఆయుత్తరక్షణమున దేశీయసైన్యములు ఖజానాను మందుకొట్లను స్వాధీనము చేసికొనవలె. అన్ని కేంద్రములలోఁ బ్రజాపరిపాలన సక్రమముగా సాగిపోయే యేర్పాటు లన్నియుఁ జేయఁబడినవి. ఇంతియే కాని, విప్లవ మింతముందుగా బయటపడునని కాని, అట్టిసందర్భములో నడుగడుగున యుద్ధము చేయవలసివచ్చునని కాని, విప్లవనాయకు లెవ్వరు నూహింపలేదు. విప్లవము ప్రారంభ మగుటతో సేనాసాహాయ్య మవసరమని యందఱు నెఱింగినవిషయమే. కావుననే ఇటౌనుండి గారిబాల్డి తనసేనను, మే 30 వ తేదీకి ఝాంఝీయూకుఁ జేర్చుటకూహించి నావల సిద్ధపఱచుట జరిగినది. పయనముగూడ సాగినదనియే చెప్పవచ్చును. కాని, మార్గమధ్యముననే విప్లవకారులు కొన్ని సేనాసన్నివేశములను స్వాధీనము గావించుకొనిరన్నవార్తలు వినవచ్చిన కారణమున నాసేన లంతటినుండియే వెనుదిరిగి రా నాజ్ఞాపింపఁబడినవి. తన శుభసందేశమును మాత్రము బహదూర్ షాకుఁ జేరునట్లు వార్తాహరునిచే గారిబాల్డి పంపించినాఁడు.

---

## ముందు పరిస్థితి

ఢిల్లీకోటనుండి దేశభక్తుల సైన్యములే ముందునకు వచ్చి ఆంగ్లసైన్యముల నెదుర్కొని వారిసి మట్టుపెట్టుట కారంభించినవి. బఖ్తుఖాను దేశభక్త సేనల కధినాయకత్వము వహించుటయే యందులకు హేతువు.

ఇతఁడు మహేలుఖండమునుండి యనంతమగు సేనా ద్రవ్యాహాహినులతో ఢిల్లీకిఁ జేరినాఁడు. అతఁడు బహాదుర్ షాచే ఢిల్లీగవర్నరుగా నియమింపఁబడినాఁడు. అప్పు డతని పర్యవేక్షకముక్రింద 14 వేల కాల్బలము, రెండు మూఁడు గుఱ్ఱపుపటాలములు, పెక్కులు ఫిరంగులు నుండినవి. ఆనాఁడు క్రొత్తగా వచ్చి చేరిన సేన లామఱునాఁడు ఆంగ్లసేనలతోఁ దలపడవలసిన నియమ మేర్పాటు గావింపఁబడినది. ఢిల్లీపౌరు లందఱు సాయుధులై యెట్టి యాపదనైన నెదుర్కొన సిద్ధముగనుంచఁబడిరి.

జనరల్ రీడ్‌నకు ఢిల్లీని తాను సాధింపలేనని తోఁచినది. సెలవుపెట్టి వెళ్ళిపోయినాఁడు. జనరల్ విల్సన్ అతని స్థానమున నియమింపఁబడినాఁడు. ఎన్నితలలు మార్చినను జయాశ దూర మగుచున్న దేకాని చూపుమేరలోఁ కాన వచ్చుట లేదు.

## నరేశుల యుదాసీనత

సిక్కులు ప్రత్యక్షముగా నాంగ్ల సేనలలోఁ జేరిరి. కొందఱు రాజపుత్రులు, మరాఠా రాజులు, తటస్థత వహించి నారు. ఇందూరు, గ్వాలియరులలోఁ దిరుగుబాటు జరిగినను. మహారాజు లుదాసీనులుగా నుండిరి. భరతపూర్ మహారాజు తన సైన్యమును కంపెనీవారికి సాయముగాఁ బంపించెను. జయపూరు జోదపూరు మహారాజులు తమ సేనల నాంగ్లేయులకు సాయముగాఁ బోవుట కాజ్ఞాపించిరి. కాని సైనికు లాంగ్లేయులం జేరఁబోవుటకుఁ దిరస్కరించిరి. వారి కున్న పాటి యూహామైన మహారాజులకు లేకపోయినది గదా!

## మిలాఖత్

### సైనికు లగువారలకు నిత్యము నేర్పఁబడు విషయములు

క్రమశిక్షణము, ఆయుధప్రయోగోపసంహారణములు, అశ్వారోహణము. దేహదార్ఢ్యమునకై కవాతు, ధైర్యసాహసములు కలిగియుండుట, ఎట్టిస్థితిలోఁగూడ భీతి నొందకుండుట, సమయస్ఫూర్తిగా శత్రువును లోఁగొనుట–ఇయ్యవి బోధనా మాత్రవిషయములు. ఈరెంటిని సమన్వయపఱచి, ఫలితము సాధింపఁబడవలసినచోటు యుద్ధరంగము. ఒకనాఁడేర్పడిన యుద్ధరంగపరిస్థితు లొకనాఁ డుండవు. ఓటమియో జయమో ఒకమాటు తేలిపోవలసినదే కాని, మరల నారంగ మేర్పడ నేరదు. అట్లేర్పడుట కయ్యది బడిబాలుర యాట కాదుగదా!

కాశ్మీరు దర్వాజా, కాబూలు గేటు, ఖూనీ దర్వాజా, లాహోరు గేటు, సబ్జీమండే—ఇయ్యవి లాల్‌ఖిల్లాజిల్లాకుఁ బ్రసిద్ధములైన ప్రదేశములు. ఆంగ్లసేన లైదుభాగములుగా విభజింపఁబడినవి. జనరల్ బ్రిగేడియర్ నికల్సన్—కర్నల్ క్యాంప్‌బెల్—బ్రిగేడియర్ జోన్సు — మేజర్ రీడు—బ్రిగేడియర్ లాంగ్‌ఫీలు—వీర లొక్కొక్కభాగమున కధిపతులు. నికల్సన్ కాశ్మీర్ దర్వాజా నాక్రమించును. తక్కిన ద్వారముల తక్కుంగలవారల వంతు అని నిర్ణయింపఁబడినది. కోటలో నున్నవారలే హఠాత్తుగా వచ్చి వారలపై బడి చావమోఁది పోవుచుండిరి. నాఁడును నాంగ్లసేనలు జయము సాధింపలేక పోయినవి. ముప్పదియైదువందల తెల్లసైనికులు, సిక్కుసైనికులు, ఘూర్ఖాపటాలములు, పంజాబీలు, ఇరువదియైదువందల మంది కాశ్మీరులు గల యాసేనలు లాల్‌ఖిల్లాను చాలదినములవఱకుఁ జేరలేకపోయినవి. రీఘంను మహారాజు తన యావత్సైన్యముతో నాంగ్లేయసేనలతోఁ జేరియేయుండెను.

బఖత్‌ఖాన్ ఢిల్లీగవర్నరుగా నియమింపఁబడెనని చదివియున్నారుకదా! ఇతను పఠాన్ వంశమువాఁడు. లాల్‌ఖిల్లాలోఁ జేరిన యనేకులు స్వదేశీయరాకుమారులు. బఖత్‌ఖాను నాజ్ఞల నుల్లంఘింప మొదలిడిరి. వారల సమాధానపఱుపఁజూచుట తనతలకు మిగిలినపనిగా ఖాను తలఁచినాడు. శక్తివంచన లేక తనచేతనున్న సేనలతో శత్రువుల నెదు

ర్కొను ప్రయత్నములో నాతఁ డున్నాఁడు. ఆంగ్లేయసేన యధి కముగాఁ జేర్పబడియున్న అజడ్ గఢ్పై కురికినాఁడు ఖాను. నీమచ్ సేనలు వేఱొక శత్రుస్థావరము నాక్రమింపఁబోయినవి.

యుద్ధసమయములో నొకనిసంచారము నొకరు వేయి కండ్లతోఁ గనిపెట్టుచుందురు. కోట దాఁటి సేనలు ద్విధావి భక్తములైనసంగతి నికల్సన్ గమనించినాఁడు. ఒకపటాల మును నీమచ్ సేనలపై కురికించినాఁడు. నీమచ్ సేనలు తిరిగి లాల్ ఖిల్లాకుఁ జేరలేదు. నాయకుని యాజ్ఞల పాలింపని సేనా నులసంగతి యిట్టిదే కదా! మూఁడు నెలల యనంతర మాసంఘ టనతో నాంగ్ల సేనలు లాల్ ఖిల్లాకుఁ జేరుట కవకాశము దొరికినది. వారల ధైర్యోత్సాహములు ఇనుమడించినవి. కోటలోని పెక్కురు గూఢచారుల నియమించుకొని, కోటలోని వార్తలఁ జెప్పించుకొను నేర్పాటు లమరినవి.

మీర్జాయిలాహీంభక్షు బహదూర్ షా నియ్యంకుఁడు. వార్తలు కోట దాఁటుట కతఁడే ప్రధాన కారణము. కాబూలు గేటు ప్రవేశముచోట జరిగినపోరు వర్ణనాతీతము. శరీరములు గుండ్లవర్షమునఁ జిల్లులు పడుచున్నవి. రక్తపుటేరులు ప్రవ హించినవి. ఆంగ్లసేన లాచోట వెనుకంజ వేయక తప్పినదికాదు.

ఫిరంగిగుండ్లవర్షము కురియుచునే యున్నది. ప్రాణము ల్లకై తెగించి నికల్సన్ కాశ్మీరు గేటునొద్ద కోటగోడకు నిచ్చెన

వైచి యతికష్టములో, బై కెగఁబ్రాఁకినాఁడు. ఇన్నాళ్ళకు లాల్ ఖిల్లాలో మొదట నడుగుపెట్టిన సాహసికుఁ డితఁడే. ఆంగ్ల సైనికుల యుత్సాహమున కంతు లేదు.

కాశ్మీరు గేటును మందుగుండుచేఁ బగులఁగొట్టఁ బ్రబల ప్రయత్నము గావించినవాఁడు కెప్టెన్ బర్గెన్. గేటు తోపాటాతఁడును కూలిపోయినాఁడు. కర్నల్ క్యాంప్ బెల్ కాశ్మీర్ గేటునుండి కోటలో నడుగుపెట్టినాఁడు.

ఈ యిరువురు సేనానులు తమ సేనలను కాబూలు గేటు దిక్కునకు నడువ నాజ్ఞ నొసంగినారు. ఇపుడు సేన లొక యిరుకుసందుగుండ నడచుచున్నవి. సందున కిరుప్రక్కలఁ గల ప్రసాదమునుండి శతఘ్నివర్షము కురిసినది. సేనలతో నికల్సన్ వెనుకంజ వేసినాఁడు. కాని అంతలో మేజర్ జాకబ్ ముందున కుఱికినాఁడు. కాని క్షణములో నేల కొఱిగినాఁడు, అది కాంచి, నికల్సన్ క్రొత్త జవసత్వములతో సేనలఁ బురికొల్పుచుఁ దానని మొన నిల్చినాఁడు. ఒక ఫిరంగి దెబ్బకుఁ దన తోడివారితో నాతఁడు భూమి కొఱఁగినాడు. సేనలు కాశ్మీరు దర్వాజాదిక్కునకుఁ దిరోగమించినవి. నికల్సన్ దవాత్ ఖాను లతోఁ బిమ్మట మరణించినాఁడు.

ఆనాఁడు పోరు ముమ్మరముగా సాగినది. అంగుళము మేర ముందునకు నడుగు వేయుటకు నుభయపక్షములవారును పెక్కురు యోధవర్యుల బలిపెట్టవలసి వచ్చుచున్నది. సుమారు అఱువదిమంది కంపెనీ ఆఫీసరులు, వెయ్యిమంది సిపాయీలు

హతమైనా రానాఁడు. కోటలోనివారును దాదాపు రెండువేల మంది కథామాత్రశేషులైనారు.

---

## ౨౩

## వీ ర వి హా ర ము

ఝూన్సీతన రాజ్యమునఁదిరిగియధికారమువహించినది. ఘూన్సీకోట శత్రుఫిరంగులధాటికి నిలువఁజాలక యొక కొంత నేలకొఱఁగినది. తెల్లవాఱునప్పటి కెప్పటియట్ల కోటగోడ నిలిచియుండుటఁ గాంచి యాంగ్లేయులు నిశ్చేష్టులయినారు. ప్రమాదవశమునఁగోటలోని మందుగుండు సామాను కొట్టునకు నిప్పంటుకొనినది. నిజముగా నిది యొక యపశకునము గదా!

శత్రువు లతిప్రయాసతో ముమ్మాఱు కోటగోడల కెగఁబ్రాఁకుటలో కృతకృత్యులయినారు. కాని లోపలివెపుఁ గాని వెలుపలివెపుఁ గాని భూమిపైఁ గాలిడుటకు వారు నోచికొనలేదు. వారముదినములు పోరు ఘోరముగా సాగినది. ఆఫగను క్రొత్తపటాలములు వచ్చి చేరినవి. రాణి, సేనానులు వెనుదిరగక, పోరాడుటకే నిశ్చయించుకొనినారు. కాని యింతలో నుత్తరద్వారము కూలిపోయినది. ద్వారరక్షకుఁడు కుంపర్ ఖుదాబక్సు కూలిపోయినాఁడు. ఫిరంగుల కధిపతి

గౌస్ ఖాన్ అను సర్దారు శత్రువులచేఁ జంపఁబడినాఁడుఁ ఈ సంఘటనలు జరిగిన పిమ్మట రాణికోటపై నాస దిగవిడిచినది.

దత్తపుత్త్రుఁడు దామోదరుని దనవీపునఁ గట్టుకొని, తన యాజానేయము నెక్కి కాల్పీకోటదిక్కుగా నరిగినది. కొలఁది పరివార మామె ననుసరింపఁగలిగినది. కోటగోడపైఁ దుదివఱకు నిలిచిన రాణి క్షణములో నదృశ్య యగుట శత్రువులాశ్చర్యపడిరి. కాని, లెఫ్టినెంటు బ్రోకరుఁ డొకఁడుఁ డామెను గుఱ్ఱముపై నెక్కి వెనుదగిలినాఁడు.

ఖాండేరాగ్రామమున రాణి క్షణ మాఁగి, కాల్య ములఁ దీర్చికొనినది. పసికూన కన్నము పెట్టించి, తిరిగి పయనమారంభించినది. వెనుకనుండి తఱుముకొనివచ్చు బ్రోకరామెను కలిసికొన వచ్చెను. రాణి తనగుఱ్ఱము వేగమును హఠాత్తుగాఁ గుంటువడఁజేసినది. ఆత్రముతోఁ బరు గెత్తివచ్చు బ్రోకరు నశ్వ మొకటి రెండడుగులు ముందు నకుఁ బోయినగాని యాఁగినదికాదు. ఆయశ్వ మాఁగునప్పటికి, గుఱ్ఱముపైఁ జేనకత్తిపుద్రాళ్ళతో బ్రోకరు సూఁచ్చుండి యున్నాఁడు గాని యాతని మెడపై తల లేదు. ఆహా! యేమి రాణి సమయస్ఫూర్తి!!

కాల్పీనగరమున కా రాణిబిడ్డలఁ జేర్చి, యామె యెక్కివచ్చిన యశ్వరాజ మట్టె క్రిందఁబడి ప్రాణములు వదిలినది. యజమానికోరిక నెఱవేర్చుటకే యద్యది యంతవఱకు బ్రతికియుండునది. నూఱుమైళ్ళదూరము నేకధాటిగాఁ బరు గెత్తుట అలోకసామాన్యము కదా!

హ్యూరోజ్ కోటను ముట్టడించినాడు. ఆంగ్లసేనల నెదురుకొనుటకు గ్వాలియరు రాణీ నాయకత్వము వహించినది. ఈమె కప్పటికి ఇరువది రెండు సంవత్సరముల వయస్సు. బాందా నవాబు, శాహగడ్ రాజు, బానాపూరు రాజు, అక్కోటయ్య యితరనాయకులకు అనాథ అల్పవయస్క యగు రాణినాయకత్వము నచ్చినది కాదు.

ఈ యుద్ధమున గొప్ప యాంగ్లసర్దారులు మరణించిరి. వారికి మహాకాళీరూపముగా రాణి గోచరించినది. ఫిరంగులు ప్రేల్చుచు గ్వాలియరువదలి పాఱిపోయినారు. హ్యూరోజునొద్దకు క్రొత్తపటాల మొకటి వచ్చి చేరినది. వారందఱు ఒక్కుమ్మడిగా రాణిని జుట్టువేసిరి. రాణిసేనలు బెదరి చెదరిపోయినవి. రాణిమాత్రము వారలనందఱిఁ జంపి చెండాడుచు, పెక్కు దేహఘాతములకు లోనయ్యు నాసేనల కండ్లలోఁ గారము కొట్టి యదృశ్యయైనది. యుద్ధమునఁ గావలసిన నేర్పది యే కదా!

లక్ష్మీబాయి కొక యుక్తి తోఁచినది. గ్వాలియరును జయించుట యయ్యెది. జియాజీరావు సింధియా దాని పాలకుఁడు. తాంతియాను ముందుగా, నచటికిఁ గొంతసేనతోఁ బంపినది. వారు గ్వాలియరుప్రభువునకు జాబు నంపినారు. దాని కాతఁడు ఫిరంగులతో వారి నెదుర్కొనెను. రాణి, పెద్దసేనానివహముతో హఠాత్తుగా నాచోటును జేరినది. దానిచే వా రాఫిరంగులు వదలి కోటలోనికి పఱచినారు.

ఆయుద్ధసామాగ్రి యంతయు రాణి వశమైనది. యుద్ధ మారంభముకాఁగానే గ్వాలియరు సేనలు రాణిసేనలతోఁ జేరిపోయినవి. అంతకుఁ బూర్వమే యేతెంచిన తాంతియా సేనానినేర్పరితనమే యయ్యెది. సింధియారాజు మంత్రి దినకరరావు చేయునది లేక ఆగ్రావైపుగాఁ బాఱిపోయినాఁడు.

ఫ్రూల్‌బాగునందు దర్బా రేర్పాటు గావింపఁబడినది. సామంతులు జమీందారులు సభ నలంకరించిరి. పీష్వాతాతల నాఁటి శిరోవేష్టనము, కలికితురాయి, రావుసాహెబు శిరము నలంకరించినవి. ఆతని పీష్వాతన మందఱకు నంగీకృత మైనది. రామారావుగోవిందు క్రొత్తపీష్వాకు సచివుఁడు. తాంత్యా ప్రధానసేనాని. నగరమున నుత్సవము లధికమైనవి. నిత్యము విందులు. విలాసములు.

మోసముచేత జయింపఁబడిన సామ్రాజ్యమును విప్లవముచే స్వాధీనము గావించుకొనుట యనఁగా **మాటలా?** ఎందఱో దేశభక్తులు స్వార్థము వదలి దేశహితమును గోరి యీవిప్లవోద్యమమున పాల్గొనినారు.

ఏదేశవిప్లవచరిత్రము చదివినను బ్రతిమాలుట–ప్రలోభపఱచుట–మోసగించుట. ఇవియే మనకుఁ గానవచ్చు ముఖ్యసంఘటనలు. భారతదేశ ప్రథమస్వాతంత్ర్యపోరాటము శుద్ధదేశభక్తి– పరిశుద్ధపరాక్రమప్రకటన– అవసర మగు పట్టుల విశాలములు, ఉదారములు, కరుణాసమన్వితములు నగు పెక్కు సంఘటనము లిందుఁ గనవచ్చు.

సిం భారతదేశ మనుపేరు నిలుపుకొనుటయే దేశభక్తుల యాశయము.

---

## ౨౪

## పెదబుద్ధి

ఒకనాఁటి రాత్రిసమయము. హుమాయూన్ సమాధి యున్న దిక్కుగా నొకపురుషుఁడు బిరబిర నడచుచున్నాఁడు. అతఁ డెవ్వరికొఱకో యత్యాతురతతో నెదురు చూచుచున్నాఁడు. కాని యెంతకు నెవ్వరు నేదిక్కునుండి వచ్చుజాడలు గానరావు. అతఁ డచట పచారు చేయుచున్నాఁడు.

స్థూలాకారముగా నున్న వస్తు వేదియో దూరమునుండి తనదిక్కునకుఁ గదలి వచ్చుచున్నట్లుగా నతనికిఁ దోఁచినది. నాలుగడుగు లెదురుగా నడిచినాఁడు. అయ్య దాతని భ్రాంతియే కాని మఱియెవ్వరును గాదు. తిరిగి వచ్చి సమాధియరుగు మీఁద నాసీనుఁ డైనాఁడు. అణుమాత్ర మలికిడియైనను తన సామ్రాట్టు వచ్చుచున్నాఁడనియే దృక్కులు దూరముగాఁ బరపిచూచుచున్నాఁడు. అతఁ డెంతటి రాజకీయరహస్యము మాటలాడవలసి యా నిగూఢస్థలమున కేతెంచినాఁడో కదా!

ఎట్టకేలకు సుదూరముగా నొకవ్యక్తి యాచోటును జేరవచ్చినాఁడు. ఆతనికై వేచియున్న యాపురుషుఁడు

సమీపమునకేతెంచునంతలో నతనిని జూచి లేచెను. నానా మట్టు తడవుగా లేచి, వీరోచితముగా నమస్కరించినాడు. ఇరువు రాతిన్నెపై సన్నిహితులై కూర్చున్నారు. సంభాషణ ప్రవర్తిల్లినది.

"సమ్రాట్! తమ కొక్క హితము మనవి గావింప నీసేవకుఁడు వేచియున్నాఁడు."

"ఏమది?"

"ఢిల్లీకోట చేయి జారినదని నిస్సంశయముగా చెప్పుచున్నాను."

"మన మిపుడు చేయఁదగిన కర్తవ్య మేమి?"

"భారత దేశమున బహుస్థలములలో మన స్వాతంత్ర్యపు జెండాలు టప టప శబ్దముతోఁ జయప్రదముగ చలించిన, దేశ భక్తులకుఁ గొదువ గొదవదు."

"తలపగిలినతరువాతఁ జేయున దిఁక నేమి?"

"హృదయము చెదరకయున్నచో నొక చిదురుదెబ్బ తలకుఁ దగిలినను ప్రమాదము లేదు"

"అయిన నన్నిట్టిస్థితిలో నేమి చేయుమందువు?"

"తమ రీచోటు విడిచి నాతో దయచేయవలయు. తమపేరున మా తనువులు దేశమాతకై యర్పింతుము."

"నేను కడు వృద్ధుఁడను. మీ ఉత్సాహవంతుఁడైన వేఱొక యువకుని నాయకునిగా నెన్నుకొనుఁడు. మిగిలిన కార్యక్రమము పూర్తి గావింపుఁడు."

“సమ్రాట్! మీరాహ్వానమును మన్నించి పితృదేవతలు పూరి పోసినారు. వీరత్వమును పునరుద్ధరించగలదా! ఒక్క యొకకోట జయాపజయములు నిర్ణయించునా! కాదనక మీరు నాతో దయచేయవలయును.”

“ఇఁక మరల నీ వెపుడు రాఁగలవు?”

“తా మెప్పుడు రమ్మని యాజ్ఞాపించిన నప్పుడే వచ్చెదను”

“సరే. ఈ వేళ కిఁక పొమ్ము.”

“చిత్తము, సెలవు.”

పాఠకమహాశయులారా! సామ్రాట్టు సెలవు గైకొని వెళ్ళినయతఁడు బఖత్ ఖాను. ఢిల్లీ నగరమునకు పైఁగా శత్రువుల వశమైనది. వారు ప్రారంభించిన హత్యాకాండ యిట్టిదని వ్రాయఁజాలము. ఆ చిత్రవధలు నరకమునందైనను గాన రావు. భారతీయవీరు లొక్కరును విడువఁబడలేదు. తుదకు క్షతగాత్రులై చికిత్స నొందుచున్నవారిని సైతము విడిచినారు కారు. పాపము వారలకుఁ జిత్రవధ కనుచికిత్స గాఁబోలును! నగరమున నెచటఁ జూచినను శవదుర్గంధము. చావుబ్రతుకుల మధ్య నున్నవా రాశవములమధ్య నెందఱో కలరు.

ఈవార్తలు బహదుర్ షాకు నెప్పటికప్పుడు తెలియుచునే యున్నవి. మఱియు నతని వియ్యంకుఁడు ఇలాహీభక్షి బఖత్ ఖానుతోఁ గోట వెడలుట నీతి కాదని బోధన నారంభించినాఁడు. ఆప్తవాక్యము నాతఁ డెట్లు త్రోసివేయఁగలఁడు? మఱునటిరాత్రి యతఁడు బఖత్ ఖానుతోఁ నుడివినటుల సంకేత

స్థలమునకు వెడలలేదు. ఆనాఁడు తెల్లవాఱినది. విల్సను హాడ్సనులు బహదూర్ షాను జూడ నేతెంచిరి. ఆతఁడు సమర్యాదగా వారి నాసీనులఁ గావించెను. "తమకుఁ దమకుమారులు పంపిన లేఖారూపకసందేశము తెచ్చితి నిదిగో చిత్తగింపవలె" అనిరా రాయిరువురు.

"తైమూరుసంతతివా రెవ్వరు యుద్ధమున నోడి పాఱి యెఱుంగరు. వంశమర్యాద నిలువఁబెట్టిన యీ వీరరాకుమారులమార్గమునే నేను ననుసరించెదఁగాక!" అని కత్తి దూసి నిలిచినాఁడు. వెనుకనుండి సైనికు లేతెంచి యాతని బందీకృతుఁ గావించినారు. ఆసమయమున నాచోటును దూరముగా బక్షు తిరుగాడుచు నాతనికిం గానవచ్చినాఁడు. గోముఖవ్యాఘ్రము లన నిట్టివారే కదా!

ఇప్పుడు కర్నల్ బర్న్ నగరసైనికగవర్నరు. ఢిల్లీ పట్టణమును సైనికులు దోచుకొనుట కనుమతి యొసంగినాఁడు. ఇంక నాభీభత్సమును మే మిట వర్ణింపలేము. మలబారు స్పెషల్ పోలీసులు మకాము చేసిన చోటుల నివసించువారి భంగిపాటు వినినవారి కచటి వృత్తాంతము కొంచెముగా తెలియవచ్చు ననుకొందును.

ఒకసంవత్సరమువఱకు తురకయిండ్లన్నియు గవర్నమెంటుజప్తులో నుండును. అనుజ్ఞాపత్రము లేక తురక లెవ్వరు బజారులలో తిరుగరాదు. హిందువులకధికముగా

జరిమానాలు- వారు బజారులలో నివసింపవచ్చు- అను శాసనము గావింపఁబడినది.

## దైవేచ్ఛ

ఢిల్లీ లక్నోలు తిరుగుబాటునకు సమానప్రతిపత్తి గలవి. ఢిల్లిలో జరిగినంత కోలాహలము లక్నోలోగూడ జరిగినది. క్యాంపుబెల్ లక్నో జేరునప్పటికి కోట స్వాధీనమగు స్థితిలో లేదు. ప్రహరీగోడ కంతటను ఫిరంగులే. నగరమున కుత్తరదిశ గోమతీ ప్రవాహము గలదు.

నానా స్వయముగా సంరక్షించు కోట యయ్యెది. అహమ్మద్ షా, తాంతియా, బేగంహజరత్ మహాల్-అందఱు కఱడుగట్టిన దేశభక్తులే. ఊటరమ్ ఉత్తరపుదిక్కున, క్యాంపుబెల్ ఈశాన్యదిక్కున తలపడినారు. నలువదివేల సైన్యము వారలకడ నున్నది. పోరు ఘోరముగా జరిగినది. రక్తపుటేరులు ప్రవహించినవి. ఇరువాగుల పెక్కు నాయకులు పతనము నొందినారు. ఏమైన నేమి? నగరము చేయిజారిపోయినది. జయాపజయములు దైవాధీనములు కదా!!!

ఢిల్లీ లక్నోకోటల పతనవృత్తాంతవిషయము దేశమున వ్యాప్తమైనది. దిల్ ఖుష్ భాగ్, కదమ్ నూలు, షాహన్ జల్ బేగంకోఠీ మున్నగు చోటుల దేశభక్తు లెంతపట్టుదలతోఁ బోరాడినను, అంతిమక్షణములో జయము పరాజయముగా ప్రవర్తించినది.

# సమీర

పలాయనము చిత్తగించిన [illegible], రావు [illegible] నాశ్రయించినాఁడు. ఇఁక నేమి గ్వాలియరు వశము చేసికొనియెను [illegible] కొనినాఁడు హ్యూరోజు, ఝాన్సీ వెన్నంటి తరుముచు వచ్చిన యతని కియ్యది శుభశకునము కాదా ?

అతివేగముతోఁ బయనము సాగించి గ్వాలియరుఁ ముట్టడి నారంభించినాఁడు. [illegible] నాశించిన జియాజీ యాతని మంత్రి వారితో నుండఁగా [illegible] భయ పడవలసిన దేమికలదు ? మఱియు జనరల్ స్మిత్ అను సర్వ సేనాని. పెద్దయెత్తున గాలింపఁబడిన [illegible] గాను సాహేబు గడ గడ లాడినాఁడు. ఝాన్సీ [illegible] లిరువురు మంధర, ఇందిర అనువారల యుద్ధ చాతుర్య [illegible] నే యానాఁటి వారి జయమునకు మూల[illegible].

ఆమఱునాఁ డింకను తూర్పు తెల్లవారకముందే తూర్పుద్వారమును శత్రువులు ముట్టడించిరి. లక్ష్మి కీవార్త తెలిసినది. తక్కిన సైనికుల కాజ్ఞల నంపి తాను తూర్పు ద్వారసంరక్షణమునకై పరుగిడినది. చెలులామె ననుసరించినారు. సంకులయుద్ధము జరుగ నారంభించినది. రాణీ కరవా లమున కెందఱో యాంగ్ల సైనికులు మడియుచుండిరి. కొంద

లొక్కుమ్మడిగా నామెపైఁ బడినారు. వారలఁ దప్పించుకొనునంతలో నొక తుపాకిగుండుచే నామెతో నున్న మంధర గుఱ్ఱమునుండి క్రిందఁ బడిపోయినది. లక్ష్మీబాయి వెంటనే యా గుండు వెట్టిన వానికడకుఁ బరుగెత్తి యతనితల నఱికివైచినది.

లక్ష్మీబాయి యొకచోట నొక చిన్నకాల్వ దాఁటి పోవలసివచ్చినది. అయ్యది దాఁటుటలోఁ గొంత విలంబము జరిగినది. శత్రుమూక లామెపై నుమికినవి. అపు డామె గమనిక చేయే వారల నెదుర్కొనినది. వెనుకనుండి యొకవీరుఁడు లక్ష్మీబాయితలపై నొక్క ప్రాణఘాతము గావించినాఁడు. రక్తములో నామె మునిఁగి తేలుచు వీరవిహారము చేయుచున్నది. ఆమెవక్షమున వెంటనే వేఱొకపోటు తగిలినది. రోషారుణిత నేత్రయై యామె ముందున కుఱికి తన్ను పొడిచినవానిని పొడిచి, తలపై ఘాతగావించిన వానికై వెనుకకుఁ దిరిగినది. ఆతనిపై కత్తిని ఘాతము చేయుచునే యామె నేల కొఱిగిపోయినది. అప్పటి కామె మేను రుధిరశూన్యమైపోయినది.

నానాసాహేబును పట్టి యిచ్చినవారికి నవకోటిరూప్యములు బహుమతిప్రదాన మని హోమ్‌గ్రాంటుపేరున ప్రకటింపఁబడినది. ఆబహుమతి పొందినవా రెవ్వరు లేరు; కాని కొన్నాళ్ళ కాతని కొకలేఖ జేరినది. అందలి సంగ్రహము:

"భారతదేశమున మీ కంపెనీప్రభుత్వ మవలంబించిన పాలనావిధానమునకు మాజాతి యంతయు సిగ్గుచేఁ దలలు

వంచుకొనవలసి యున్నది. ఆంగ్లేయుల కీదేశమున నుండుట కేమి హక్కు గలదు ? ఈపవిత్రభూమిపై జన్మించిన మేము దాసులమా ? పరదేశీయులగు వీరు పాలకులా ? నవనననుగు స్వాతంత్ర్యమును భారతీయుల కిచ్చి మీనవకోటిజనాపద్యములకు నూతనవ్యాపారమును గావించుకొనుట మంచిది” అని

1858 నవంబరు మొదటి తేదీనుండి ఈస్టిండియాకంపెని ప్రభుత్వము హిందూదేశమున నంతరించినది. విక్టోరియారాణి హిందూప్రజలకొఱ కొక సందేశము నంపినది. లార్డు కానింగు అలహాబాదులో దారాగంజ్ దగ్గఱ కోటయెదుట నేర్పాటు గావించిన బహిరంగసభలో నాప్రకటనను ప్రజలకుఁ జదివి వినిపించినాఁడు.

## నా నా యె వ్వ రు

ఢిల్లీపతనవార్తకు బిమ్మట నీలు, కూంపన్, హేవ్లాకు. ఔట్రమ్, ఆయన్ అను సేనానులు లక్నోలో వీరవిహార మునసగున వెడలినారు. చార్ భాగ్ వంతెనయొద్ద నానాసేన లడ్డగించినవి. గొప్ప పోరు గావించినకంపెనీసేనానివహములు నదినుత్తరించినవి. అడుగు కదల్చుటకువారి కింకశక్యము కాలేదు. ఆ పోరున నీలుసేనానిమరణించినాఁడు. తక్కినవారితో హేవ్లాకుబంధితుఁడైనాఁడు. వీరల విడిపించుటకై కలకత్తానుండి సర్ కాలిన్ క్యాంపుబెల్ లక్నోకు బయలుదేఱినాఁడు. ఇతఁడిపుడు కంపెనీచే నియమింపఁబడిన క్రొత్త కమాండర్ ఇన్ చీఫ్.

ఇతని క్రింది యధికారి జనరల్ గ్రీట్ హెడ్. ఆంగ్లేయు నొకనికి భారతీయవేషము వేయించి రహస్యముగా రెసిడెన్సీకిఁ బంపినాఁడు ఆతనియీపన్నాగము చక్కఁగాఁ బారినది. ఐదవనాఁడు రెసిడెన్సీఖైదీలు లోపలనుండి, హాడ్సనుగ్రాంటులు రెసిడెన్సీ బయటనుండి యుద్ధ మొకసారిగా నారంభించుటయే యాతఁడు పన్నిన పన్నాగము. ఖైదీ లతికష్టనష్టములకు గుఱియై బంధవిముక్తు లైనారు; కాని హేవ్లాకు వెంటనే మరణించినాఁడు.

కాంపుబెల్ లక్నోను వదలి కాన్పూరునకు నడచినాఁడు. దారిలో తాంతియాం యాతని నెదుర్కొనినాఁడు. ఇరువురకు బలము సమానముగా నున్నది. కాని తుదకు తాంతియాకు నోటమి తప్పినదికాదు.

క్యాంపుబెల్ నానాను అహమ్మదుషాను సజీవులనుగా గ్రహించి ప్రభుత్వము మెప్పు వడయఁదలఁచినాఁడు. పహాజాన్పూరుసొద్ద వారల నెదుర్కొన్నాఁడు. కాని యది యడియాస యైనది. ఆతని కండ్లముందటినుండియే యాయిరువురు తప్పించుకొని పాఱిపోయినారు. వారికై తఱుముకొని పోయినచోఁ జేఁజిక్కి నకోట జాఱిపోవునేమో యనితత్ప్రయత్నము నతఁడు విరమించినాఁడు.

పూవు పుట్టగనే పరిమళించును. ఆహా! వింటిరిగదా మననానా, గుణసంపదల నభివృద్ధిఁజెంది ధైర్యసాహసికుఁడై అభ్యస్తరాజనీతి విద్యాధురంధరుఁడై సర్వకార్యసమర్థుఁడై

వెలుఁగొందియున్నాఁడు. ఎందును తేజము దాఁగనేరదుగదా! తేజోవంతులు చేయరానిపనులు గలవే? నానా సామాన్య కుటుంబమునందలి గంగాబాయి—మాధవరావ్ నారాయణ భట్టు—దంపతులకు కుమారుఁడై జన్మించినాఁడు. తనసుగుణ సంపత్తిచే మోరోపంతునకు దత్తుఁడై ఝాన్సీలక్ష్మీబాయికి సహజసోదరునివలె చేకోడు వాడోడుగ రాచకార్యనుల సాహాయ్యుఁడై పేరుప్రఖ్యాతులఁగాంచి, విప్లవప్రచారముల నాయకత్వము వహించి తేజోరాశి యనిపను యశశ్చంద్రికల నలుదిశల వ్యాపింపఁజేసినాఁడు. వీరవిహారముల తన ప్రజ్ఞలను నిరూపించినాఁడు. ఎట్టి ఘట్టములపైన వెనుదీయక సాహసాదిసద్గుణముల వెదజల్లినాఁడు. ఏయేదేశముల నిట్టి ప్రతిభావంతులు జన్మింతురో ఆయాదేశములు ఏనాటికైనా మహదైశ్వర్యముల నొందును. అందలిప్రజలెల్లరుగుండెలపైఁ చేయివేసికొని సుఖింతురుకదా! అట్టి యసంఖ్య ప్రజ్ఞాధురంధరులకు జోహారు లర్పించుచు మనముకృతార్థులమై యట్టిమార్గమనుసరింతుముగదా.

సంపూర్ణము.



శ్రీ కొండపల్లి ముద్రాశాల, రాజమండ్రి